బోస్ సమరసన్నాహం.

12-2-39

Regd. No. M. 3824

# నవశక్తి

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారపత్రిక

సంపుటం 2 | బుధవారం | 8-2-39 | బెజవాడ | సంచిక 9



రాష్ట్రపతి బోసు.

సంపుటం 2 సంచిక 9

# నవశక్తి

బుధవారం 8-1-39

సంపాదకవర్గం: మద్దుకూరి చంద్రశేఖరరావు (సంపాదకుడు). కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య. తుమ్మల వెంకట రామయ్య.

## కాంగ్రెసు భవిష్యత్కార్యక్రమం

ఎన్నికకు ముందు పటేలు సుభాసును "తిరిగి ఎన్నుకొనుట దేశానికి అపాయకర"మన్నాడు. ఎన్నికానంతరం గాంధీజీ "ఏమైనా విరోధి కాదు గదా!" అని నిట్టూర్పు విడిచాడు. ఎన్నికకు పూర్వం పటేలు ప్రభృతులు అధ్యక్షుని ఎన్నికలో కార్యక్రమం పాలసీల కెట్టి సంబంధమూ లేదన్నారు. ఎన్నికల అనంతరం గాంధిజీ పట్టాభి ఓటమి తన పాలసీ, కార్యక్రమాల ఓటమియే అన్నాడు. అందుచే వర్కింగ్ కమిటీలో గాంధివాదులు ఉండరనీ, తీవ్రవాదులతోనే బోసు తన కార్యక్రమాన్ని కొనసాగించుకోవాలనీ అంటున్నాడు కృపాలినీ. కార్యక్రమంలో త్రిపురి కాంగ్రెసు తీవ్రమైన మార్పులు తెస్తే గాంధివాదులు కాంగ్రెసు బయటికి పోయే దేశ సేవ చేస్తారనీ, "తాము అంగీకరించని కార్యక్రమాన్ని అమలు జరపాలని" కాంగ్రెసు కోరితే కాంగ్రెసు మంత్రులు రాజీనామా యిస్తారని కూడ గాంధిగారు సూచించారు. కొన్ని పత్రికలు తీవ్రవాదులు మంత్రులను రాజీనామా యిచ్చి బయటికి రమ్మంటారేమోనని జోస్యం చెబుతున్నాయి.

వివేచనా దృష్టితో పరిశీలించితే బోసు విజయం ఒక పక్ష విజయం కాదు. ఫెడరేషన్‌పై ఎట్టి రాజీ పనికిరాదనీ, ఎన్నికల ప్రణాళికను, ఫైజ్‌పూర్ కార్యక్రమాన్ని యింకా పట్టుదలతో శీఘ్రంగా అమలు జరపాలనీ, మంత్రిపదవులు బ్రిటీషు సామ్రాజ్య రక్షణ కేర్పడిన శాంతి భద్రతల రక్షణకొరకు గాక ప్రజా ఉద్యమాల అభివృద్ధి చేసి బానిస రాజ్యాంగాన్ని నాశనం గావించుటకు వినియోగించాలని కాంగ్రెసు ప్రజా సామాన్యము నాయకుల కిచ్చిన హుకుం మాత్రమే. అందుచే గాంధీవాదులు తమ పాలసీ ఓడిపోయింది కాన బయటికి పోతామనడం సబబు కాదు. కాంగ్రెసు హుకుములను అమలు జరపాలిసిన మంత్రులు, తమకు యిష్టము కానిచో రాజీనామా యిస్తారనుట డిసిప్లినుకు వ్యతిరేకం; దాన్ని గాంధిగారే ప్రోత్సహించుట విషాదకరం.

కాంగ్రెసు సంస్థలోనే ప్రజాస్వామిక సూత్రాలను పరిపాలించలేకపోతే భారత ప్రజాస్వామికాన్ని ఎలా నెలకొల్పగల్గుతాం? ప్రజాస్వామికాభిప్రాయాలను పాటించుట, అధిక సంఖ్యాకుల నిర్ణయాన్ని మన్నించుట, కాంగ్రెసు రాజకీయాలలో ప్రధానమయిన విషయాలు. ప్రజా ఉద్యమాలకు జీవకర్ర డిసిప్లిన్. అట్టిచో తమ అభ్యర్థి ఓడిపోయె నని కాంగ్రెసునుండియే పోతామనుట, ఏబది సంవత్సరాలనుండి వీరుల త్యాగబలముచే నిర్మింపబడిన కాంగ్రెసు మహాసభ బలాన్ని చీల్చుటయే. మేము గాంధీజీని, యితర మితవాద నాయకులను హృదయ పూర్వకముగా కాంగ్రెసును బద్దలు చేయవద్దని కోరుతాము. ఇదివరకు తీవ్రవాదులను అహింసా శుద్ధి పేరిట కాంగ్రెసునుండి తరుమ ప్రయత్నించినపుడూ అటులే కోరాము. కాంగ్రెసులో సంపూర్ణ స్వాతంత్ర్య కాంక్ష గల వారందరికి మితవాదులకు, తీవ్రవాదులకు, కమ్యూనిస్టులకు సోషలిస్టులకు అందరికి తావుంది.

బ్రిటీషు ప్రభుత్వం దేశమంతా నిరాకరించిన ఫెడరేషన్‌ను మనపై రుద్దబోవు సమయమిది. సంస్థానాలలో ప్రజానీకము బాధ్యతాయుత ప్రభుత్వంకొరకు సాగించుచున్న పోరాటాన్ని సామ్రాజ్యవాదులు, నరేంద్రులకు అండగా నిలచి, అణచివేయ ప్రయత్నించుచున్న రోజులివి. కొలది మాసాలతోనే ప్రపంచ సంగ్రామం పొసగు అవకాశాలు స్పష్టంగా కాన్పించుచున్న క్లిష్ట దినాలివి. బ్రిటిషు సామ్రాజ్యాంతర్గత బానిస దేశాలైన పాలస్టయిన్, ఐర్లండులు ఈఅవకాశంలో తమ సామ్రాజ్యాన్ని గుంజుకొన జూచుచున్న సమయమిది. బ్రిటీషు సామ్రాజ్యానికి అన్నివైపులా అంధకారము అలముకొన్న యీ సమయంలో భారత స్వాతంత్ర్య అంతిమ పోరాటాన్ని జయప్రదంగా కొనసాగించుటకు మహదవకాశాలున్న యీ సమయంలోనా కాంగ్రెసులో చీలికలు? అట్టి సంగతి నభిలషించువారు నేడు ప్రజలకు, స్వాతంత్ర్య పోరాటానికి శత్రువులు! కాన ప్రస్తుతం కాంగ్రెసువాదులందరి పని, భుజంభుజం కలిపి రణరంగానికి ఉరుకడం; మన అందరి శత్రువయిన బ్రిటీషు సామ్రాజ్యాన్ని భారతదేశంలో లేకుండా చేయడం, అని విన్నవించుతున్నాం.

సుభాసు చంద్రుడు చెప్పినటుల నేడు తీవ్రవాదులు కాంగ్రెసు మంత్రుల్ని రాజీనామాయిచ్చి రమ్మని కోరుటలేదు. ఫైజ్‌పూర్ కార్యక్రమాన్ని ఎన్నికల ప్రణాళికను అమలు జరుపమంటున్నారు; శాంతిభద్రతల రక్షణకంటే ప్రజా ఉద్యమాన్ని ప్రోత్సహించుట తమకర్తవ్యంగా ఎంచమంటున్నారు. 1935 ఇండియా ఆక్టుకు కట్టుబడియుండుటగాక, భారత ప్రజాస్వామిక రాజ్యాంగ విధానాన్ని నిర్ణయించుటకు ప్రజా ప్రతినిధి పరిషత్తు నేర్పరచుటకు మార్గాన్ని సమకూర్చ మంటున్నారు. ఫెడరేషన్‌పై రాజీ సాధ్యమనే భ్రమలను వదలుకోమంటున్నారు. ఇందు తీవ్రమైన మార్పులు లేవు గదా? ఇక చీలికకు తావెక్కడిది? కాన, గాంధివాదులు కాంగ్రెసును విడచుట అనే నినాదాన్ని వదలుకోవాలని మనః పూర్వకముగా కోరుచున్నాము.

ఇక తీవ్రవాదు లొక విషయాన్ని గమనించాలి- ఫైజ్‌పూర్, హరిపుర కాంగ్రెసులలో సంస్థాన ప్రజా ఉద్యమాలను, కాంగ్రెసు జోక్యం కలుగచేసుకొని, నడపాలను సోషలిస్టుల తీర్మానాలను గాంధివాదులు ఎదిరించి ఓడించారు. ఇపుడు గాంధిజీ, పటేలులే, ఒకవైపు సంస్థానాలలో ప్రజా ఉద్యమాలు బ్రిటీషు సామ్రాజ్యవాదుల సహాయంతో నిరంకుశంగా అణచవేయబడుతూంటే. మరొకవంక బ్రిటీషు ప్రభుత్వానికి రాష్ట్రాలలో కాంగ్రెసుమంత్రుల సహకారం యివ్వజాలమని హెచ్చరించుతున్నారు. ఈ మార్పుకు కారణమేమిటి? నాడు అపుడే వేరూనుచున్న సంస్థానప్రజా ఉద్యమం ప్రజ్వలిత మగునన్న విశ్వాసం, ధైర్యం గాంధివాదులకు లేమి. నేడు ఒరిస్సా, గుజరాతు సంస్థానాలలో నరేంద్రుల నిరంకుశత్వం బ్రిటీషు సైనిక సహాయంతోనే కాపాడబడుతూంటే, నాడు సోషలిస్టులవాదన అంగీకరించని పెద్దలు తామే ముందంజ వేస్తున్నారు. అంటే ప్రజా ఉద్యమ తీవ్రత నాయకులను కూడ తీవ్రమొనరించుననియేగదా!

అందుచేత తీవ్రవాదుల, సోషలిస్టుల, కమ్యూనిస్టులకర్తవ్యం స్పష్టమే. ప్రజాసంఘాలలో పనిచేయండి. వారివారి ఆర్థిక హక్కులకోసం పోరాటం సాగించండి. తద్వారా కార్మిక-కర్షక ప్రజాసామాన్యంలో రాజకీయ చైతన్యం వృద్ధిచేయండి. సంస్థాన ప్రజా ఉద్యమాన్ని యింకా ముందుకు తీసుకుపొండి. ఈ వివిధ ప్రజా పోరాటాలతో బానిస రాజ్యాంగానికి వ్యతిరేక పోరాటానికి వున్న సన్నిహిత సంబంధం ప్రజలకు ఎరుకపరచండి. కాంగ్రెసులో నేడు పొడచూపుతున్న చీలికలు అదృశ్యమవుతాయి. సంయుక్త జాతీయ సంఘటన దిగ్విజయంగా సాగుతుంది. ఐక్యతను కాపాడుశక్తి ప్రజా ఉద్యమంలో వుంది. ప్రజాపోరాటాన్ని వృద్ధిచేయుటకు మీశక్తిని ధారపోయండి.

ఎన్ని ప్రయత్నాలు చేసినా గాంధీవాదులు కలసి రానిచో సుభాసుచంద్రుడు జంకరాదు. కార్యక్రమంపై మాత్రం రాజీపడరాదు. బోసు యిచ్చిన కార్యక్రమం ప్రస్తుత పరిస్థితులలో అత్యంత అవసరమైనది. (దానిపై వ్యాసం వేరొకచో ముద్రింపబడింది) దాన్ని పూర్తిగా మేం బలపరుస్తున్నాము. బోసుపై కాంగ్రెసు సామాన్య సభ్యులు నమ్మకం ఉంచారు. అధ్యక్షుడు తన కార్యక్రమాన్ని కాంగ్రెసు అనుచరుల పూర్తి సహకారంతో సాగించాలి. గాంధీవాదులు సైతం పోరాటగమనంలో తప్పనిసరిగా వారంతట వారే కలుస్తారు: లేనిచో జాతీయ ఉద్యమానికే దూరమైపోతారు.

నేడు కాంగ్రెసు ఐక్యతయే స్వాతంత్ర్యపోరాటానికి జీవగర్ర.

ఐక్యత నెదుర్చువారు ప్రజా విరోధులు.

**రాష్ట్రకాంగ్రెస్‌కమిటీవారి నివేదిక**

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీవారి సాంవత్సరిక నివేదిక వెలువడింది. జమీందారీ ఉపసంఘం, చీరాల కాల్పుల విచారణ, ముస్లిం ప్రజాసంబంధ సమితి—వీటిద్వారా కమిటీవారు రాష్ట్రములో పీడిత ప్రజా సామాన్యపు హక్కులకై గావించిన కృషి ప్రశంసార్హములు. ముఖ్యంగా, జమీందారీ ఉపసంఘమువారి సిఫార్సులన్నీ యించుమించు యిదివరకే రాష్ట్ర రైతు సంఘం, రాష్ట్రకాంగ్రెసు సోషలిస్టుపార్టీలచే ప్రచారం గావించబడ్డాయి.

కాని రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ వారికి అవకాశము ఉండి కూడా నెరవేర్చని కార్యక్రమం ఎంతో ఉంది. "ఫెడరేషన్" అనే శీర్షికతో ఒక కరపత్రము ప్రకటించడము తప్ప మరే విధంగాను రాష్ట్ర కమిటీ హరిపూర్ కాంగ్రెస్‌లో ప్యాసైన ఫెడరేషన్ ప్రతికూల తీర్మానాన్ని ఆచరణలో పెట్ట లేక పోయింది. యు. పి., కేరళ, రాష్ట్రాలలో ఆయా రాష్ట్ర కమిటీవారు బ్రహ్మాండమైన వాలంటీరు దళాలను నిర్మించి నడుపుతోంటే, మన కమిటీ "అఖిల భారత కాంగ్రెసు కార్యసంఘంవారి నిర్దేశమునకై" యింకా ఎదురు చూస్తూనే ఉంది.

కాంగ్రెసు మంత్రుల యెడల మన రాష్ట్ర కమిటీ చూపిన వైఖరి యెట్టిదో చూద్దాం. "మదరాసు మంత్రులతో చక్కని బాంధవ్యం ఏర్పరచుకొన్నాము చాలా సారులు, రహస్యంగా కూడ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ వచ్చినవి.... మేమెప్పుడు గౌరవనీయులైన మంత్రులకు తోడ్పడ సిద్ధంగా ఉన్నాము" అని నివేదిక చెపుతోంది. కాన్పూరు సమ్మె విషయములోను, యు. పి. రైతాంగపు బిల్లు విషయములోను, యు.పి. రాష్ట్ర కాంగ్రెసు కమిటీవారు చూపిన స్వతంత్ర కార్యాచరణ అక్కడి మంత్రులకు మార్గదర్శిత్వము వహించగా, మన కమిటీవారు యింకా "తోడ్పడ్డం"లోనే ఉన్నారు! గ్రంథ నిషేధాలు, పత్రికానిషేధాలు కాంగ్రెసు మంత్రులచే ప్రయోగించబడుతూంటే, మన రాష్ట్ర కమిటీవారు ధైర్యముతో ప్రభుత్వానికి తగిన సలహాల నివ్వలేక పోయారు.

అంతే కాదు. అనేక లోపాలు కూడా ఉన్నాయి, కమిటీవారిలో. కార్మిక—కర్షక కార్యాలయం అంటూ ఒకటి నిర్మించి, దాన్ని రైతు సంఘ ప్రతికూలుర చేతుల్లో పెట్టి, హరిపూర్ తీర్మానానికి వ్యతిరేకముగా నడిచారు. మ్యునిసిపాలిటీలలోను, జిల్లాబోర్డులలోను "స్వార్థపరులు" కాంగ్రెసు అభ్యర్థులుగా ఉండి, కాంగ్రెసుకు వ్యతిరేకముగా పని చేశారని నివేదిక అంగీకరించి అట్టివారిమీద డిసిప్లినరీ చర్య గైకొనబడిందని కమిటీ అధికార్లు జవాబు చెప్పవచ్చును. గాని, అభ్యర్థుల నియామకము విషయములో మొదటనే శ్రద్ధ వహిస్తే, ఇట్టి అక్రమాలు జరిగేవి కావు.

కాంగ్రెసు కమిటీ ఎన్నికలలో కూడ చాలా అన్యాయాలు, అక్రమాలు జరిగినవని నివేదిక చెపుతోంది. కాని, నిజమైన నేరస్థుల్ని కమిటీ విడిచిపెట్టి, నేరము చేయని సోషలిస్టులమీద డిసిప్లినరీ చర్యలు అమలు పరచింది.

భారతదేశ మంతటికీ వెల్లడి అయిన పశ్చిమ కృష్ణా వ్యవహారం విషయమై నివేదికలో ఎక్కడా ఉదహరించక పోవడము వింతగా ఉంది.

**అతివాదులు మితవాదులు**

పాలు తాగే పిల్లి కళ్లు మూసుకొని, తనను ఎవరూ చూడ్డం లేదనుకొంటుంది, పాపం! ఆ విధంగా ఉన్నది కొందరు నాయకుల, పత్రికల, ప్రకనటలు. కాంగ్రెసులో అతివాదులు — మితవాదులు అనే వారు లేరని ఆ మధ్య మంత్రి గోపాలరెడ్డిగారు కాకినాడ బహిరంగ సభలో చెప్పారు. అ. భా. కాంగ్రెసు కమిటీ కార్యదర్శి కృపాలినిగారు మాటి మాటికి "అతివాదులన బడేవారు," "మితవాదులన బడేవారు" అని వాడటం మామూలయింది. ఈ మధ్య బోసు ఎన్నిక దుమారంలో, ఒక్క ఆంధ్ర రాష్ట్రంలో తప్ప మిగిలిన దక్షిణ దేశంలో సోషలిస్టులు లేనే లేరని తెలుగు పత్రికలు, సంపాదకీయాలు, వ్యాఖ్యలు వ్రాశాయి. ఇండియా మొత్తంమీద, 21 రాష్ట్రాలలో ఒక్క కేరళ రాష్ట్రము సోషలిస్టుల సంపూర్ణ స్వాధీనములో ఉంది. దానిప్రధాన కార్యదర్శి నంబూద్రిపాద్‌గారు కేరళలో శంకరన్ సోషలిస్టు నాయకుడు. ఇక, తమిళనాడు విషయము. నూతన రాష్ట్ర కాంగ్రెసు కమిటీలో సోషలిస్టుల సంఖ్య ఆంధ్ర సోషలిస్టుల సంఖ్యకంటే ఎక్కువే. తమిళనాడు రాష్ట్ర కాంగ్రెస్ వర్కింగు కమిటీలో ముగ్గురు సోషలిస్టులు కూడా సభ్యులుగా ఉన్నారు. కర్ణాటక రాష్ట్రం విషయంకూడా యించుమించు ఇంతే.

ఈ విధముగా నాయకులు, పత్రికలు యదార్థ విషయాలను కప్పి పుచ్చడాన్ని కర్తిలేని "సత్య-అహింస" లంటారు కాబోలు!

**బోసుకి నల్ల జెండాలు!**

సుభాష్ బోసు బెజవాడ వచ్చునప్పుడు వారికి నల్ల జండాలు చూపి అవమాన పరచడానికి తీర్మానించింది, బెజవాడ యందలి "ఆంధ్ర పార్లమెంటు", ఇతర రాష్ట్రాలలో హిందూ—ముస్లిం ఉద్రేకాలను రెచ్చగొట్టి దేశ ద్రోహానికి ఒడిగట్టుకొంటూన్న కొందరు నాయకుల మాదిరిగానే, "ఆంధ్ర పార్లమెంటు"లో ఉపన్యసించే వ్యక్తులు, ఆంధ్ర రాష్ట్రాభిమానం పేరుతో, భారత దేశానికి తీరని అపకారము చేస్తున్నారు. అధ్యక్షపు ఎన్నికలలో విజయము గాంచిన సుభాష్ బోసును అభినందిస్తూ డాక్టర్ పట్టాభిగారు టెలిగ్రాం యిస్తే. ఫెడరేషను విషయములో బ్రిటిష్ ప్రభుత్వంతో రాజీపడి అయినా ఆంధ్ర రాష్ట్రం సంపాదించాలని ఆదుర్దాపడే "ఆంధ్ర పార్లమెంటు" నాయకులతో నల్ల జండాలు చూపడానికి ఒక్క వ్యక్తి కూడా రాదని "ఛాలెంజ్" చేసి చెప్పగలం.

**కాంగ్రెసు—కాంగ్రెసేతర రాష్ట్రాలలో**

బెంగాల్ రాష్ట్ర విద్యార్థి సంఘానికి యిటవరలో అధ్యక్షుడును, ఉత్తర కలకత్తా జిల్లా కాంగ్రెసు కమిటీకి కార్యదర్శియు అయిన ధరిత్రి గంగూలీ గారికి రాజద్రోహ నేరం క్రింద 2 నెలల కఠిన శిక్ష, 100 రూపా జరిమానా విధించబడింది. పంజాబులో, లాహోరు ప్రాంతములో 7 గురు సోషలిస్టుల మీద, రైతుసంఘ ప్రచారకుల మీద ప్రభుత్వము దౌర్జన్య నేరారోపణ చేసి, ఎరస్టు చేసింది.

కాని, కాంగ్రెసు రాష్ట్రాలలో కూడా నిర్బంధ విధానము విచ్చలవిడిగా చెలరేగుతోంది. బొంబాయి రాజధానిలో బెల్గాం జిల్లా మేజస్ట్రీటు 16 గురు గోకక్ మిల్లు యూనియన్ సభ్యులమీద 48 గంటలలో ఆప్రదేశము విడిచపెట్టవలసిందని నోటీసు జారీ చేశాడు. ఒరిస్సా రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ తరపున ప్రకటించబడిన "సర్వ నాశనంలోనే విముక్తి" అను కరపత్రం రాజద్రోహపూరితంగా ఉండడము వల్ల ఒరిస్సా ప్రభుత్వము దాన్ని నిషేధించింది. లక్నో ప్రెస్ కార్మికుల సమ్మె సందర్భములో 19 గురు కార్మికులు పోలీసులచేత ఎరస్టు చేయబడ్డారు. మొన్నటి స్వాతంత్ర్య దినోత్సవంనాడు అహమ్మదాబాద్ విద్యార్థులు సల్పిన సమ్మెను నడిపినందుకు జస్వంత్ ఠక్కర్ (బొంబాయి రా॥ విద్యార్థి సంఘ కార్యదర్శి) కాలేజినుంచి వెళ్ళగొట్టారు. యు. పి. లో బలరాంపూర్ పంచదార మిల్లు సమ్మెను చూమటకై వెళ్ళుతూన్న జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుణ్ణి, మరొక కాంగ్రెసు ప్రచారకుని 144 వ సెక్షను క్రింద పోలీసులు ఎరస్టు చేశారు. మదరాసులో 10 మంది డమోసీషియన్ ప్రెస్ కార్మికుల పైనను, 40 మంది పబ్లిక్ వర్క్సు వర్కుషాపు కార్మికుల మీదను, సమ్మె సందర్భములో ఎరస్టు చేయబడి కేసులు పెట్టబడ్డాయి.

ఈ విధముగా కాంగ్రెసు రాష్ట్రాలలోకూడ అడ్డులేని నిర్బంధ విధానం ప్రజల పౌర స్వేచ్ఛలకు తీరని ఆటంకాలు కలుగజేస్తుంది.

**జమీందారీ బిల్లు గతి**

ఇంచుమించు 1 సంవత్సరం క్రితం ఒరిస్సా శాసన సభలో ప్యాసైన జమీందారీ బిల్లుకు ఒరిస్సా గవర్నరు ఇంకా అనుమతించలేదు. దాన్ని యింకా వడపోత పోయడానికి జమీందార్లకు, కాంగ్రెస్ ప్రధానికి, గవర్నరుకు మధ్య రాజీ సంభాషణలు జరిగాయి. జమీందార్లు కోరిన షరతుల్ని ఒరిస్సా రాష్ట్ర కాంగ్రెసు కమిటీలోనూ, కాంగ్రెసు పార్టీలోనూ ప్రసపాదించి చూస్తానంటూ ప్రధాని తన కార్యాలయం చేరుకున్నాడు. మదరాసులో కూడా ప్రకాశం కమిటీ నివేదికను తమ కనుకూలంగా మార్చివేసుకోవాలని జమీందార్లు ప్రయత్నిస్తున్నారు. బొబ్బిలి, మీర్జాపుర, వెంకటగిరి మొదలయిన జమీందార్లు మొన్న రాజాజీ వద్దకు డెప్యుటేషన్ వెళ్లారట. "ప్రధానికీ—మాకూ జరిగిన సంభాషణలు అసంతృప్తికరములుగా లేవం"టూ వెంకటగిరి రాజాగారు పత్రికా విలేఖరులతో చెప్పారు.

ఈ రెండు ఉదాహరణలను బట్టి కాంగ్రెసు మంత్రి వర్గాలు ఎంత దుర్బలత్వాన్ని ప్రకటిస్తున్నాయో బోధపడుతుంది. గవర్నరును, జమీందార్లనూ, సంతృప్తిపరచే ప్రయత్నాలు మన రాజాజీ కట్టి పెట్టకపోతే, రైతులు సత్యాగ్రహానికి తయారు కావలసి వస్తుంది.



**బర్మా నివేదిక**

రంగూన్ అల్లరుల విచారణ కమిటీవారు గత జూలై లో జరిగిన రంగూన్ అల్లరులను గురించి తమ ప్రథమ నివేదికను ప్రకటించారు. 1929 లో ప్రారంభమైన ప్రపంచ క్షోభకు బర్మాకూడా గురియై, ఉదర పోషణార్థమై బర్మన్లు అనేక వృత్తులను చేబట్టవలసి వచ్చినదనియు; కాని భారతీయులు ఇదివరకే వాటిని ఆక్రమించడంవల్ల యిరువురికీ పోటీ తప్పనిసరి అయిన దనియు: ఈ పోటీయే అల్లరులకు కారణము అనియు నివేదిక తెలుపుతోంది. కాని, యితర కారణాలు కూడా ఉదాహరించబడ్డాయి. ఇండియానుంచి బర్మా వేరైనప్పటినుంచీ బర్మనులలో కలిగిన జాతీయాభిమానము, భూస్వాముల అధికారం క్రింద నలిగి కృశించే బర్మన్ రైతుల నికృష్ట జీవితము—యివి కూడా అల్లరులకు కారణమేనని నివేదిక తెలియజేస్తోంది. ఇంతవరకు సక్రమముగానే ఉంది. కాని, బర్మా జాతీయోద్యమము "కమ్యూనిస్టుల"చేత నడుపబడుతోందనీ; ఈ ఉద్యమాన్ని ప్రభుత్వము అణచకపోతే "ప్రమాదకరమయిన అశాంతి" ప్రబలగలదనీ—కూడా వ్రాయబడింది. అభివృద్ధికి వ్యతిరేకమయిన ప్రతి ప్రభుత్వము జాతీయోద్యమాలకు "కమ్యూనిస్టు" నాయకత్వము అంటగట్టి, వాటిని అణచివేయడము ప్రతిచోటా మనకు కనపడుతూనే ఉంది. ఉద్యమాన్ని అణచే ప్రయత్నముకంటె, బర్మా ప్రభుత్వము అల్లరులకు అసలు కారణాలను నివారణ చేయడము వివేకము. ఎందువల్లనంటే, నిర్బంధ విధానము వల్ల ఏ ప్రజా ఉద్యమము ఇంతవరకు అణచబడలేదు.

**బొంబాయి మంత్రుల రాజీనామా**

రాజకోట సంస్థానములో ప్రజా ఉద్యమాన్ని అణచడానికి ప్రభుత్వం సైనిక దళాలను పంపే విధానము మార్చుకొనక పోతే, బొంబాయి కాంగ్రెసు మంత్రులు రాజీనామా యివ్వవలసి వస్తుందని వల్లభాయి పటేలు బొంబాయి సభలో ఉపన్యసించాడు. ఒరిస్సా రాష్ట్రములో కూడా యిదే స్థితి. కాని సైనికులు రావడము సంస్థాన ప్రజలను భయపెట్టడానికి కాదనీ, వారి స్నేహం సంపాదించడానికేననీ, ఒరిస్సా కాంగ్రెసు ప్రధాని ప్రకటించడము చేతగాని తనాన్నే కాక, ప్రజా ప్రతికూల వైఖరిని తెలియజేస్తోంది. యిండియాలో నేడు సంస్థాన ప్రజా ఉద్యమం గంట గంటకూ హెచ్చిపోతూంది. దాన్ని అణచడానికి బ్రిటిష్ ప్రభుత్వము చేస్తూన్న ప్రయత్నాలను ఎదుర్కోడానికి ఒక బొంబాయిలోనే కాకుండా, ఇతర కాంగ్రెసు రాష్ట్రాలలో కూడా, మంత్రులేమి చేయవలసియున్నదో నిర్ణయించడము అఖిల భారత కాంగ్రెసు వర్కింగు కమిటీవారి కర్తవ్యం.

**కేంద్ర శాసన సభ**

ఢిల్లీలో సమావేశమైన కేంద్రశాసనసభలో కాంగ్రెస్ సభ్యులు అనేక ముఖ్యమైన తీర్మానాలను ప్రతిపాదించారు. కాని, వైస్రాయి వాటికి అనుమతి నిరాకరించాడు. సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని అనుభవించే సరిహద్దు ట్రైబల్ టెరిటరీ'లో కేంద్ర ప్రభుత్వము ఎట్టి జోక్యము కలిగించుకొనరాదనీ; 14 రాష్ట్రాలలో ఒకటైన సరిహద్దు రాష్ట్రములో కేంద్ర ప్రభుత్వ స్వాధీనములో ఉన్న జిల్లాలను రాష్ట్ర మంత్రులకు స్వాధీనము చేసి స్వపరిపాలనా హక్కు నివ్వాలనీ; రాష్ట్రానికి కావలసి ఉండే పర్వత ప్రదేశాన్ని కేంద్రప్రభుత్వము యొక్క "విదేశ వ్యవహార శాఖ" నుండి రాష్ట్ర ప్రభుత్వానికి స్వాధీనము చేయాలనీ—సత్యమూర్తి ప్రతిపాదించిన తీర్మానానికి వైస్రాయి అనుమతి నివ్వలేదు. ఇప్పటి శాసనసభ ఇక పొడిగించబడకూడదనీ; సైన్యాన్ని భారతీయుల వశము చేయడానికి నియమించబడిన ప్రభుత్వోపసంఘాన్ని గురించి శాసన సభలో చర్చ జరగాలనీ; ఒరిస్సా రాష్ట్రానికి చెందిన సంస్థానాలలో ప్రజా ఉద్యమాన్ని అణచడానికి కట్టక్ పంపబడిన కేంద్ర ప్రభుత్వపు సైనికదళాలను గురించి చర్చించడానికీ—ప్రతిపాదనలు వస్తే, అన్నిటినీ వైస్రాయి నిరాకరించాడు.

కేంద్ర శాసన సభలో ప్రజా ప్రతినిధుల మాటకు యింత విలువ ఉన్నదన్నమాట! ఫెడరల్ శాసన సభ వస్తే, యిప్పుడున్న విలువకూడా ఉండదు. కాబట్టి కేంద్ర శాసన సభ్యులు ఫెడరేషన్ ప్రతికూలోద్యమంలో విరివిగా పాల్గొనాలి.

**విద్యార్థులు—రాజాజీ**

"విద్యార్థి సంఘాలు తమ తమ కనీసపు కోర్కెల ప్రణాళికలు, హక్కుల ప్రకటనలు మొదలయిన వాటితో ముందుకి వస్తున్నారు. ఉల్లంఘించి, శిక్షలు పొందటము చాలా సరదాగానే ఉంటుంది. కాని, దేశానికిది ఎంతో అపకారం."

అంటూ మదరాసు ప్రధాని రాజాజీ లయొలా కళాశాల (మదరాసు)లో ఉపన్యసించాడు. ఇప్పటికైనా విద్యార్థి సంఘాలకు కనీసపు కోర్కెలు ఉన్నవని గుర్తించినందుకు సంతోషం. అయితే, "బానిసలయిన భారత జాతికి స్వరాజ్యము కూడానా?" అని బ్రిటిషు సామ్రాజ్యవాదులు వెటకారంగా ఆడిన మాటలు మదరాసు ప్రధాని యిప్పుడు మరచినాడు కాబోలు!

**బ్రిటిష్ సామ్రాజ్యములో భారతీయులు**

మలయా ద్వీపములో విస్తారంగా పండే రబ్బరు పంటకు భారతదేశంనుండి పోయే అనేక వేలమంది భారతీయ కూలీలను వినియోగిస్తారు. కాని, వారి అవసరం తీరగానే తిరిగి ఇండియాకు పంపివేస్తారు. యిట్టి కూలీల రక్షణకై ఇండియా ప్రభుత్వము కొన్ని ఏర్పాట్లు చేయవలసిందని సిఫార్సు చేయుటకు మలయానుంచి సెంట్రల్ ఇండియన్ ఎసోసియేషన్ వారు వచ్చారు. మలయాలోని భారతీయులకు పౌరహక్కు ఇవ్వకపోతే ఇండియానుంచి ఎవరినీ వెళ్ళనీయరాదనీ, వారి కీయవలసిన జీతం, వైద్య సహాయం, విద్యాసౌకర్యము మొదలయిన షరతులన్నిటికీ వ్రాతపూర్వకముగా మలయా ప్రభుత్వము అంగీకరించేటట్లు చేయవలసినదనీ—ఇండియా ప్రభుత్వముతో వీరు మొర పెట్టుకొంటున్నారు.

ఇదేవిధముగా, జమైకాలో భారతీయ కూలీలు తమ పెట్టుబడిదార్లకు వ్రాసియిచ్చిన ఒడంబడిక పత్రాల షరతులన్నీ నెరవేర్చినప్పటికీ, వారికి భూములు గాని ఇతర పరిహారము గాని ఇవ్వక చివరకు తమ దేశానికి రాదలచుకొంటే ప్రయాణపు ఖర్చులు సహితం ఇవ్వక హింసిస్తున్నట్లు "ఈస్ట్ ఇండియన్ నేషనల్ యూనియన్" వారు ప్రకటిస్తున్నారు.

ట్రాన్సువాల్‌లో భారతీయులు భూములు సంపాదించుకొనరాదని 1885 లో ప్యాసు చేయబడిన చట్టము నేటికనీ అమల్లో ఉంది. ఇండియా ప్రభుత్వము చేత దక్షిణ ఆఫ్రికాకు పంపబడిన రామారావుగారు తమనివేదికలో, ఈ శాసనాన్ని రద్దుచేయవలసిన అవసరాన్ని తెలియ చేశారు. భారతీయులు భూములను సంపాదించుకొని, స్థిర నివాసము ఏర్పరచుకొంటే, వారి అనారోగ్యం యూరపియనులకు వ్యాపిస్తుందనే కారణంతో మొదట శాసనము చేయబడింది. ఈవాదన నేడు ఎట్లు సరికాదో రామారావుగారు తమ నివేదికలో చక్కగా నిరూపించారు.

**సింధు రాష్ట్రంలో కాంగ్రెసు పార్టీ**

సింధు రాష్ట్రములో, నేటి అల్లాబక్షు మంత్రి వర్గముమీద ప్రతి పక్షులు ప్రతిపాదించిన విశ్వాస రాహిత్య తీర్మానము అత్యధిక సంఖ్యాకులచే ఓడించబడిన తరువాత, రీ సెటిల్మెంటు రేట్లను అమలు జరపడానికి ప్రభుత్వము నిశ్చయించుకొంది. పత్తి పంటకు విధించబడిన కొత్త రేట్లు చిన్న వ్యవసాయదార్లకు అపకారము కలిగిస్తున్నవి. కాబట్టి, క్రిందటి సెటిల్మెంటు రేట్లే ఖాయం చేయవలసినదనీ, యకరానికి 5 రూపాయల కంటె తక్కువ గాని, 10 రూపాయల కంటె ఎక్కువగాని విధించకుండా, ధరల ఎక్కువ తక్కువలను బట్టి పన్ను రేట్లు కూడా మార్చాలి—అని కాంగ్రెసు పార్టీ సభ్యులు ఎసంబ్లీలో తీర్మానం ప్రతిపాదిస్తే, 20 వోట్లు కాంగ్రెసుకూ, 30 వోట్లు ప్రభుత్వానికి లభించి, ప్రభుత్వమే గెల్చింది.

అయినా, తమ స్థానాన్ని ఇప్పటికంటె బలపరచుకొనేటందుకు మంత్రివర్గము ఒక హిందూ మంత్రిని, ఒక ముస్లిం మంత్రిని అదనముగా తీసుకొనడానికి నిశ్చయించుకున్నారు. కాంగ్రెసుకు ప్రాతినిధ్యము ఇవ్వలేమని వల్లభాయి పటేల్—అల్లాబక్షుల కిరువురి మధ్య అయిదారు మాసాలనుంచి ఎడతెగని సంభాషణలు జరుగుతూన్నప్పటికీ, సింధు రాష్ట్రంలో కాంగ్రెసుపార్టీకి ఉండవలసినంత బలము, గౌరవము ఇప్పుడు లేవు.

**బెంగాల్ రాజకీయ మహాసభ**

ఈ నెల 4, 5 తేదీలలో జల్పాయిగురిలో సమావేశమైన బెంగాల్ రాజకీయ మహాసభకు శ్రీ శరత్‌చంద్రబోసు అధ్యక్షత వహించాడు. సుభాష్‌బోసు కూడా సమావేశము చివరవరకూ ఉన్నాడు. ఫెడరేషన్‌ను గురించి ఏకగ్రీవంగా అంగీకరించబడిన తీర్మానమే రేపు త్రిపురీ కాంగ్రెసులో కూడా సుభాషు బోసు ప్రతిపాదించ వచ్చుననడములో సందేహం లేదు. 1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టం భారతీయుల ఆశయాలకు ఏ విధంగా విరుద్ధమో తీర్మానములో చెప్పబడింది. అందలి రెండవ భాగమైన ఫెడరల్ రాజ్యాంగ విధానాన్ని ప్రతిఘటించవలసిన అవసరము వివరించబడింది. భారతీయులచే, అనగా ప్రజా పరిషత్తు సభచే తయారు చేయబడు రాజ్యాంగ విధానం బ్రిటిషు ప్రభుత్వముచే అంగీకరించబడాలనీ; ఆ విధముగా యిరు ప్రభుత్వాల ప్రతినిధులు సంధి పత్రంమీద సంతకములు చేయాలనీ; భారతీయుల ఆశయాన్ని బ్రిటిషు ప్రభుత్వము గుర్తించడానికి 6 మాసాల గడువు ఇవ్వబడవలెననీ; గడువు లోపల సరియైన జవాబు రాకపోతే, అ. భా. కాం. కమిటీవారు దేశానికి కొంత ప్రత్యక్ష కార్యక్రమము యిచ్చి, దాన్ని ప్రజలచేత అమలు జరిపించాలనీ—తీర్మానములో ప్రధానాంశము...

(పనివాని గది. లోపలిభాగం. ఆకాశంవేపు తెరిచికొని చిన్న కిటికీ ఉంది. కుడివేపున కవాటం.

కార్మికుని భార్య పొయ్యిదగ్గర కూర్చుని ఉంది: ఇద్దరు పిల్లలు "అజు, జ్యోతి" కిటికీకి ఎదురుగా ఉండి మాటలాడు కుంటున్నారు.

అజు:- చెల్లాయి జ్యోతీ! నీవు మేఘాన్ని చూస్తున్నావా?
(జ్యోతి సంతోషముతో చప్పట్లు కొడుతూంటుంది) అదిగో పెద్దతెల్లని గుర్రం. అసలైన గుర్రం.

జ్యోతి:- కాని అది కుంటిది. జోరుగా పరుగెత్తలేదు.

అజు:- అది కుంటిదికాదు. ముసలిది.

జ్యోతి:- ఎందుచేత అన్నయ్యా! చెప్పు అన్నయ్యా! ఆ మేఘం తాత గడ్డంలాగ .... ఎంత తెలుపో!

అజు:- చూడు! చూడు! అది కదులుతుంది. అది ఎక్కడికి వెళుతూందో ఆశ్చర్యంగా వుంది.

జ్యోతి:- చూడు! అది ఒంటెలాగుంది! మూపురంకేసి చూడు. దానిమీద ఎవ్వరో స్వారీచేస్తూన్నట్లున్నది. అది చాలా దూరం పోతూంది.

అజు:- అది. ఒంటె ఎట్లాగవుతుంది? నువ్వు ఒంటెకట్టిన గంటలు వినలేవు!-చూడుచూడు ఎలా ఎర్రబడుతూందో! ఓ. ఎంత ఎరుపు-రాత్రి ..... వచ్చినప్పుడు ఉండే నాన్నకండ్లలాగ ఎంత ఎరుపు నాకు ఎర్రని మేఘం అంటే ఇష్టం ఉండదు. నీకుంటుందా?

జ్యోతి:- ఉహుఁ! ....అది అసహ్యంగావుంది. ఫ్యాక్టరీ కొలిమి తిత్తులలోని నిప్పులాగుంది. ఎర్రని మేఘం అంటే ఎంతేనా సహించదు నాకు. ఓ రాత్రి తాత కన్నుమూసు కొని పెద్ద నిద్రపోయాడు. వాళ్ళంతా చచ్చిపోయాడని చెప్పి తాతని దహనం చేశారు. ఆ దహనపు మంటలా గుందీ మేఘం.

అజు:- అవును! ఎర్రని మేఘం....దేనిలాగుంది చెల్లీ? నీకు జ్ఞాపకం ఉందా. నాన్న స్నేహితుడు జీవ-అతని చేయి యంత్రంలో పడి నలిగిపోయింది. వ్రేళ్లాడుతూన్న మాంసం నీకు జ్ఞాపకముందా .... ! ఎట్లా కనిపించిందో, ఓఁ .... !

జ్యోతి:- (తలచికొన్నమాత్రాన ఏడుస్తూ) ఓ....ఎర్రని మేఘాలంటే నాకు సయించదు!

అజు:- కాని, నాకు ఎర్రగులాబి అంటే, ఎంతో ఇష్టం. ప్రతి రోజూ ప్రొద్దున్నే నాన్న పనిచేస్తూన్న ఫ్యాక్టరీ దొర తన కోటుకి గులాబీని పెట్టుకొంటాడు.

కూలివాని భార్య:- ఇంక చాలించండి. అజూ, వెళ్లి లాంతరు వెలిగించు.

అజు:- కాని, అమ్మా! ఇంకా చీకటి పడలేదు—ఇంకా ఆకాశం మెలకువగానే ఉంది.

జ్యోతి:- కిటికీ అంటే నాకు ఇష్టం. నీకో అజూ?

అజు:- కిటికీ తెరిచి ఉన్నప్పుడు ఆకాశమంటే ఇష్టం.

జ్యోతి:- కిటికీ మూసివేసినప్పుడు బద్దలైపోయిన అద్దం-తలుపు లోంచి రాత్రిని చూస్తూండటం నాకిష్టం. రాత్రంటే ఏమిటి అజూ?

అజు:- ఏహే! ఎవరైనా చెప్పగలరు. నీకు తెలియదూ?

జ్యోతి:- అవునులే నాకూ తెలుసు.... కాని, నీకు తెలుసునా

అజు:- తెలియకేఁ! నాకూ తెలుసు .... దేముడు నిద్రపోతే మనకు రాత్రి—అతను లేస్తే అప్పుడు పగలు.

జ్యోతి:- అజూ, ఆమేఘం చాలా దూరం పోయింది! మన తాత పోయిన చోటికే అదికూడా పోయిందనుకుంటా! తాత ఎంతో మంచివాడు. మన తాత ఎంత సరదాగా ఉండేవాడు! కాని, ఎప్పుడూ బెంగగా ఉండేవాడు.

అజు:- జ్యోతీ, నీవెప్పుడైనా బెంగ పెట్టుకొంటావా?

జ్యోతి:- అప్పుడప్పుడు అమ్మ ఏడుస్తూంటే చూసినప్పుడే కాని కిటికీలోంచి ఆకాశం నవ్వుతూ, దోబూచి లాడుతూన్నప్పుడు నాకు ఎంతో హాయిగా ఉంటుంది!

అజు:- నేను దీపం వెలిగిస్తా. అమ్మా! అగ్గిపుల్ల లెక్కడున్నాయి?

కూలివాని భార్య:- ఇక్కడున్నాయి, పదమూడు పుల్లలు మాత్రం మిగిలాయి. నీవు జాగ్రత్తగ వాడాలి సుమా. దీపం వెలిగించేటప్పుడు కిటికీ మూసివేయి. లేకుంటే గాలివల్ల చాలా పుల్లలు ఖర్చవుతాయి.

★ నాటిక

# కిటికీ

## శ్రీ హరీంద్రనాథ ఛటోపాధ్యాయ

అనువాదం : శ్రీ జనమంచి రామకృష్ణ

అజు:- లేదమ్మా! నీవు చూడ్డువుగానిగా ఎంత జాగ్రత్తగా దీపం వెలిగిస్తానో. మొదటి పుల్లతోటే దీపం వెలిగించి తీరుతా. (పుల్ల వెలిగిస్తూ)

జ్యోతి:- హాయి! హాయి!........ ఎంత అందమో! మంట కన్నులాగుంది. అది దేనికోసమో చూస్తూన్నట్లుంది.

అజు:- ఇప్పుడు, ఇప్పుడు జ్యోతీ! జాగ్రత (మంట ఆరిపోతుంది.)

కూలివాని భార్య:- అదిగో! ఒకపుల్ల వృధా అయిపోయింది! నేను చెప్పానుగా!

అజు:- అమ్మా, అది నా తప్పుకాదు..........జ్యోతి........

జ్యోతి:- అజూ! నేనేమీ చేయలేదు. వెకిలిగా ఉండకు.

అజు:-ఓ అమ్మా! అమ్మా! ఈ పాడు పుల్లలు ఎప్పుడూ ఇంత పాడుగా వెలగలేదు.

కూలివాని భార్య:- రెండు అగ్గిపుల్ల లప్పుడే వృధా అయినాయి. ఇంక పదకొండుమాత్రం మిగిలాయి. మరి పదమూడుండేవి.

జ్యోతి:- అమ్మా! పదమూడు సంఖ్య చెడ్డదని ఫ్యాక్టరీవాళ్ళందరు అస్తమానం అంటారు.

కూలివాని భార్య:- (కుర్రవాడిదగ్గరనుంచీ అగ్గిపెట్టె లాక్కుంటు) నేనే వెలిగించుకుంటాను. పొండవతలికి. పొండి. కుర్రకుంకల్లారా! నాన్న ఇప్పుడు ఇంటికి వచ్చినట్టయితే గదంతా చీకటి చీకటిగా వున్నందుకు తిట్లు శాపనార్థాలు పెడతాడు. వెర్రినాన్న....యంత్రంమోస్తరు అతను రోజంతా కష్టపడి....రోజంతా....యంత్రంలాగ....యంత్రంలాగ! (పిల్లలు కిటికీమూస్తారు.)

అజు:- జ్యోతీ! చీకట్లో భయపడతావా?

జ్యోతి:- ఉహుఁ! పడను! నీవు?

అజు:- ఉహుఁ, చీకటంటే నేను భయపడను.

జ్యోతి:- నేను పగలంటే ఎంతో భయపడతానని నాన్న అమ్మతో చెప్పుతుంటే విన్నాను. పగలంటే ఎందుకు భయం?

అజు:- నీవు చూడటల్లేదూ? రోజంతా పనిచేయాలి—ఓ చూడు చూడు! ఆ కొండవెనక పెద్ద పసుపుపచ్చని వెలుగు. నీవు చూడగలవా? అక్కడ! అక్కడ!

జ్యోతి:- ఓఁ అవా! చంద్రుడు....చందమామ....నాకు చందమామంటే ఇష్టం! అన్నా! నాకు చందమామ కావాలి!

అజు:- నీ కది దొరకదు.

కూలివాని భార్య:- (వెలిగించిన దీపాన్ని గోడకు తగిలిస్తూ తనలో తాను అనుకొంటుంది.) పశుపులమూకలం.... ఎవ్వరు జాగ్రత్త తీసికోరు....ఎందుచేతనంటే పోషణ లేనివి. మావి బీదకూలీల కుటుంబాలు....చదవూసందే లేనివాళ్ళం. దరిద్రులమై, చింకిగుడ్డలు కట్టికుని, బక్కచిక్కి, కారు చీకటిరాజ్యం చలాయించే సందు గొందులలో కాపురం చేస్తూ-హడలెత్తి పోయి—బ్రతికి ఉండే ఎందునా పొందనివాళ్ళ నడకలతో—వాళ్ళ నేపుల్లో పని ముట్లులాగ నీడలమై....మనిషికి లోకువై, వాళ్ళ స్వతంత్రజీవులై ఉండగ-కుష్ఠు — హేళన-రోగం....మందకొడిగా, కృశించే చావు:—దాన్ని గురించే, నిద్రలో కూడ నా వెర్రివాడు పలవరిస్తూ ఉంటాడు. (వంటచేయటానికి తిరిగి వెళ్ళిపోతుంది.)

అజు:- (ఉదయిస్తూన్న చంద్రుణ్ణి చూపిస్తూ) ఎంత పెద్దదిగా, గుండ్రంగా వుందో, పెద్ద బంగారపు పళ్ళెంలాగ.

జ్యోతి:- అది బంగారపుకాసనుకుంటా! నాకంటే బాగుండేది. దాంతోటి ఎన్నేనా కొనుక్కుంటా.

అజు:- ఏమిటి కొనుక్కుంటా వేమిటి?

జ్యోతి:- నేనే! నేను బజారులో మిఠాయి కొనుక్కుంటాను.

అజు:- మరి, నేను బంతి కొనుక్కుంటాను. హాయి! ఎంత సరదాగా వుంటుంది. రేపు పగలంతా, దాంతోటి ఆడుకుంటూంటే ఎందుకేమిటి, చెల్లీ! చంద్రుడు నిజంగా బంతి అనుకుంటా. ఒకవేళ దేముడు దానితోటి ఆడుకుంటాడేమో!

జ్యోతి:- ఈ కిటికీ అంటే ఎంతో ఇష్టం నాకు. ఎన్నేనా తమాషా వస్తువులను ఇక్కడుండి చూడొచ్చు - ఈ కిటికీ గుండా—అజూ! మనం పాడదామా?

అజు:- ఏమిటి పాడదాము?

జ్యోతి:- కిటికీమీద ఓ పాట

అజు:- అట్లాగే. నువ్వు మొదలు పెట్టు

జ్యోతి:- ఉహుఁ! నీవు మొదలెట్టు.

అజు:- ఇద్దరం పాడదాము.

(జ్యోతి, అజు పాట పాడటం మొదలెడతారు.)

కిటికీ, కిటికీ! చక్కటి కిటికీ!
జాబిల్లిని చూపించే కిటికీ!
తెరిచి ఉంటె నీలో చూస్తాము
పరుగెత్తే ఎన్నో మేఘాలూ!
మూసిఉన్న వేళల్లో మేమూ
మూసిన అద్దాల్లో చూస్తామూ,
కిటికీ, కిటికీ! చక్కటి కిటికీ!
జాబిల్లిని చూపించే కిటికీ!

(పాట అయిపోయిన తర్వాత, వాళ్ళు వెకిలిగానవ్వుతూ కేకలిడతారు. ఆ ముఫుగు సందులోఉన్న పిల్లలూ ఇంకా క్రింద సందులోఉన్న పిల్లలు వీళ్ళ కేకలందుకుంటారు.)

కూలివాని భార్య:- ఇదిగో! ఏమర్రోయ్! మీ ముంతెడు గంజీ త్రాగి ఇక పడుకోండి వేళైంది. (పిల్లలిద్దరు, ముంతెడు గంజి త్రాగి ఎవరికి తెలియకుండగ వెళ్ళిపోయి గదిమూలను పడుకుంటారు.)

పొరుగింటి స్త్రీ ప్రవేశం.

పొరుగావిడ:- ఈరాత్రికి ఏదైనా ఒకకుండ ఈయగలవమ్మా! మాది పగిలిపోయింది.

కూలివాని భార్య:- తప్పకుండగాను చెల్లీ! ఇదిగో ఇది పట్టుకొనివెళ్లు. మళ్ళీ యిచ్చివేయాలని ఇబ్బంది పడకు.

పొరుగావిడ:- ఎంత మంచిదానివమ్మా. నాకుర్రది, కుండమీద పడి బ్రద్దలు కొట్టింది.

కూలివాని భార్య:- చెల్లీ! ప్రతివస్తువూ, ఎప్పుడో ఒకప్పుడు బ్రద్దలవుతుంది.

పొరుగావిడ:- ఈరాత్రి, మీ ఆయన ఆలస్యంగా వస్తాడింటికి.

కూలివాని భార్య:- మీ ఆయన పనిలోనుంచి తిరిగి వచ్చాడో లేదోనని నేను ఇప్పుడే అడుగుదామనుకుంటున్నా.

పొరుగావిడ:- లేదు. చూశావు పనివాళ్ళనందరిని కలసికొనేటందుకు మేమందరం వెడుతున్నామని అతను చెబుతున్నాడు-నేననేది-అవును. పనివాళ్ళందరూ కలసి-ఏదో స్థిరపరచడానికి-అదేమిటో నాతో చెప్పలేదతను. నేను మాత్రం తిరిగి వచ్చేశాను.

కూలివాని భార్య:- అవును వాళ్ళందరు అలసిపోయి విసుగెత్తి ఉన్నారు. వెర్రివాడు! నీవలె, తక్కిన పొరుగువాళ్ళ భార్యలలాగ పనిలోకివెళ్ళి కొంచమైనా సహాయం చేయలేకపోతున్నా. నా అశక్తతకి ఎంతేనా విచారంగాఉంది. కాని, నేనూ సహాయం చేస్తా—కొద్దిగా ఆరోగ్యం కలగ్గానే చూశావు! నాగుండెలు ఎంతో నొప్పిగ ఉంటాయి. మరి రక్తం కూడా వుమ్మిలో పడుతూంది. కాని, దాన్ని గురించి అట్టే విచారించకూడదు. పని చేయటం మొదలు పెట్టానంటే, అదే, ఆరోగ్యంగా ఉంటుంది.

పొరుగావిడ:- పని, పని, పని! దీని అర్థం ఏమిటో తెలియకుండా ఉంది నా కప్పరమేస్తుంది. మనం బాధలు పడేటందుకు ఎందుకు పుట్టామో—మనము అసలు ఎందుకు పుట్టాము—కొంతమంది విశ్రాంతిగా ఉండటానికి ఎందుకు పుట్టారు. తక్కినవాళ్లు కాయకష్టపడటానికి— దుఃఖసముద్రంలో మునగటానికి ఎందుకు పుట్టారు?



కూలివాని భార్య:- అది మన కర్మ అని కామందులు చెప్తారు. బ్రహ్మరాసిన రాతట—రాత-భగవంతుని దయ. అవును. అట్లాగే మన కస్తమానం చెప్తారు.

పొరుగావిడ:- అతను మన ప్రార్థనలు విని, ఏదో మనకు సహాయం చేస్తాడనే ఆశతో మన మహోరాత్రాలు దేవుని పొగడుతూంటాము.

అజు:- (గుసగుసలతో) జ్యోతీ. రేపు మనం ఒక లాయిని పొడుగాటి తాడుకట్టి దొడ్లోకి వ్రేళ్ళాడతీద్దాము!

జ్యోతి:- అల్లాగే చేద్దాము! (వాళ్ల పడుకుంటారు)

కూలివాని భార్య:- దేముణ్ణి పొగడాలి. అవును; నడుము విరిగిపోతూన్నప్పటికి శరీరంలో రక్తంచుక్క లేకపోయినా దేముణ్ణిమాత్రం పొగడుతూండాలి! నోరు పడిపోతున్నప్పుడు-చచ్చిపోతూన్నప్పుడు-సమస్తం మృతరూపం దాల్చినప్పుడుకూడా!

పొరుగావిడ:- కాని, దేముడున్నాడు.

కూలివాని భార్య:- నా కాశ్చర్యమేస్తుంది! (గాలిలోంచి పొరుగువాళ్ళ పిల్ల ఏడ్పు వినబడుతుంది.)

పొరుగావిడ:- ఆ ఏడుస్తూన్న పిల్లనాదే. ఎక్కువగా రాత్రి ఇబ్బంది కల్గించిందా మీకు?

కూలివాని భార్య:- ఓహో, నిన్నరాత్రి విపరీతంగా ఏడ్చింది. మీపిల్లా? వెర్రిపిల్ల! కోరింత దగ్గుతో బాధపడుతూన్న పొరుగింటివారి బిడ్డనుకున్నా. మీపిల్ల కేమిటివచ్చింది?

పొరుగావిడ:- క్రొత్త దేమీరాలేదు, నీకు తెలియంది. చూశావు, వళ్ళంతా పుళ్ళు, పిల్లవూపిరి, కుళ్ళు కాలవలాగ చెడువాసనేస్తుంది. కాని ఎవరైనాసరే వీటినన్నిటినీ సహించాలనుకుంటాను-అది కర్మ...., చెల్లీ! కుండ ఇచ్చినందుకు దణ్ణమమ్మా! (ఆమె బైటకు పోవును.)

కూలివాని భార్య:- ఓ భగవంతుడా! ఆ కారుచీకటి ఆకాశంలో నిజంగా అక్కడున్నావా? నీవు వినగలవా? లేకపోతే చెముడా? వినగల్గినట్టయితే మూగవాడవా నా సామీ? ఎవరునీవు పరమేశ్వరా! ప్రభూ! నీవే ఉంటే, చేసేపనేమిటి? (అలసిపోయిన శుష్క శరీరంతో కొంచెం త్రాగిన కార్మికుడు ప్రవేశిస్తాడు)

కూలివాడు:- అమ్మీ! ఇంకా దేముణ్ణి పొగడుతున్నావా? అలిసిపోయి విసిగిపోలేదూ? అతను కఠినుడనీ, క్ర్యూరుడనీ, హృదయం లేనివాడనీ, అతనికి మన దీనాలాపాలను వినేటందుకు తీరికలేదనీ నీకుతెలియదూ? మనమాటలు వింటాడా? చెమటోడ్చి జీవించే దరిద్రులము! అతను మిల్లుదార్లకి, కామందులకి అమ్ముడుపోయాడని తెలియదూ? ఎందుకు నీకాలమంతా వృధపుచ్చుతావు? నీ వుక్కిరిస్తూన్న ఊపిరి తిత్తులకు ఎందుకు శ్రమకల్గిస్తావు? కొలిమితిత్తుల బుసబుస మంటలూ, కర్మాగారాలలో విషవాయువులు వెల్తురు తగలని గొందులూ, వారిని మార్చాలంటే మార్చలేవు?

భార్య:- ఈవేళరాత్రి నీవింత ఆలశ్యంగా వచ్చావేం?

కూలివాడు:- పిల్ల లెక్కడున్నారు?

భార్య:- మబ్బులని, చందమామ అని, ఆకాశమని, వాళ్ళతాత గడ్డమని ఇంకా ఏవేవో వాగి, వాగి, ఇప్పుడే నిద్రపోయారు.

కూలివాడు:- వాళ్ళకి, ఆకిటికీ అంటే ఎంతో ఇష్టంకద్దూ! వెర్రి కుంకలు! అదొక్కటే వాళ్ల కానందమిచ్చేది. మేఘాలలోఉన్న ఆకాశం, చంద్రుడు, నక్షత్రాలూను—అవే వాళ్ళ బొమ్మలపెట్టె!—అవును! కూలీల కుటుంబములో పుట్టడమువలన, వాళ్ళ ఆటవస్తువులవే! పాపిష్టి దేముడు, నేననే దంతే, పాపిష్టి దేముడు! పాపభీతి లేకుండా కఠకుమాటలు పలికినట్టయితే నన్ను అతను క్షమించుగాక.

భార్య:- మన పొరుగునున్న ప్రద్యుమ్ది, నా స్నేహితురాలు ఓ కుండను ఎరువడిగేటందుకు ఇప్పుడియిదీ క్రితంవచ్చి వెళ్ళింది. క్రితం వారం దారిప్రక్కన జరిగిన సంతలో నీవుకొన్న రెండు కుండల్లోనూ, ఒకకుండ ఆమెకిచ్చాను.

కూలివాడు:- మంచిది! వాళ్ళకుండ ఏమైంది? పగిలిపోయిందనుకుంటా.

భార్య:- అవును మరి ప్రతివస్తువు ఎప్పుడో ఒకప్పుడు పగిలిపోతుందని కూడా చెప్పాను.

కూలివాడు:- బాగా చెప్పావు! సంతోషం. అవును. ఎందుచేతనంటే—ఎందుచేతనంటే ప్రతివస్తువు ఎక్కువ వ్యవధి లేకుండా పగిలిపోతుంది — మన బ్రతుకులు బ్రద్దలవుతాయి-మన జీవితాలలో ప్రతి నిమిషం మనం చితికిపోతున్నాము—నేనేమిటి—నువ్వేమిటి— అందరమూను— మట్టికుండలు, వట్టి మట్టికుండలు.

భార్య:- కర్మాగారం లోంచి నువ్విప్పుడే తిరిగి వస్తున్నావు కదూ?

కూలివాడు:- అవును. నీకు తెలుసునుగా! దారిలో కొంచెం.... ఆగాను.

భార్య:- వాసనే చెప్తూంది.

కూలివాడు:- మంచిది. నీకర్థమైన దనుకుంటాను.

భార్య:- తెలిసిందిలే. చూశావు. వాళ్ళు పనివాళ్లచేత త్రాగుడు మానిపిద్దామని ప్రయత్నం చేస్తున్నారుట. దానికి బదులుగా దేముణ్ణి ప్రార్థించ మంటున్నారుట.

కూలివాడు:- బీదవాడికి కల్లు మానడమంటే దేముణ్ణి వదలివేయడ మన్నమాట. దేముణ్ణి వదలివేయడమంటే కల్లు విడిచిపెట్టడ మన్నమాట.

భార్య:- సరే! సరేలే! రా, కూడుకి.

కూలివాడు:- రాత్రి నాకాకలిగాలేదు — నేను చాలా అలిసిపోయాను. ఒకముద్ద తినటానికైనా శక్తిలేదు-అంతగ అలిసిపోయినా.

భార్య:- మనసులో దేన్నిగురించో బాధ పడుతూన్నట్లుగా వున్నావు.

కూలివాడు:- అవును ఒక పుకారు పుట్టింది.

భార్య:- ఏమిటా పుకారు?

కూలివాడు:- ఎప్పటికైన అన్నిటిమీదా వాళ్ళు పన్ను వేస్తారని మనవాళ్ళంటున్నారు.

భార్య:- ఎవరా శాసనాలు చేసేవాళ్లు?

కూలివాడు:- శాసనాలను నిర్మించే వాళ్ళని ఎప్పుడూ మనము చూడలేము. వాళ్ళు పరమపవిత్రులు, మహానుభావులును. వాళ్ళు దేముడితో సమానం. మనము ఎప్పుడూ వాళ్ళని చూడకూడదు. ఎందుచేతనంటే మనం వాళ్ళని చూసిన మరుక్షణమే దేముళ్ళలాగ ఉండడం మానివేస్తారు. అప్పుడు నిజమంతా బయటపడుతుంది.

భార్య:- చిత్రంగా ఉన్నాయి శాసనాలు! అన్ని శాసనాలు మనుష్యులు చేసినవేనా?

కూలివాడు:- అన్నీను! అవును సమస్తము! మిల్లుచట్టాలు, కర్మాగారపు చట్టాలు, భూమిచట్టాలు.

భార్య:- కర్మ సిద్ధాంతంకూడానా?

అవును. అమ్మీ! అది కూడ విచిత్రమైంది. అన్నిటిల్లోకి గడుసుతనంతో చేసింది! మనం పూర్వం చేసుకొనిన పాపఫలం వలననే ఇట్లా త్రొక్కుళ్లతో చిక్కిపోయి, ఆకలితో బాధపడతాం అని ఆ కర్మసిద్ధాంతం చెపుతూంది. వాళ్ళు నశించాలి. మరి మనం వాళ్ల చెప్పు చేతలకు తల వాలుస్తాము. ఏట.... నీవేమనుకుంటావమ్మీ వాళ్ల ఇంకొక శాసనం అమల్లోకి తేబోతున్నారు, దాన్ని గూర్చే మేమీవేళ పొద్దంతం వింటి. నీవు అదేమిటో ఎన్నటికి వూహించుకోలేవు.

భార్య:- ఏమిటి! ఏమిటి!

కూలివాడు:- భయంకరం! ఘోరం, నీచం—నా వెర్రిపిల్లలు

భార్య:- వాళ్ల మనవద్దనుండి మనపిల్లల్ని తీసికొని పోదలచుకున్నారా? ఏమిటి నీవనేది?

కూలివాడు:- వాళ్లకు అంత సాహసమే! అమ్మీ! నేను ఇక్కడుండగ మాత్రం చేయలేరు! ఈ విషరక్తం నా నాళాల్లో రక్తపు చుక్క ప్రవహించేటంతకాలం, వాళ్ళుమాత్రం సాహసించలేరు.

భార్య:- అయితే మరేమిటి?

కూలివాడు:- ఇప్పుడు మాత్రం చెప్పలేను, వద్దు చెప్పకూడదు. ఉహుఁ! నేను చెప్పను! మంచిది మంచిది! వాళ్ల ప్రయత్నాలు సాగనీ ఎంతపని చేయాలని ఆలోచిస్తే అదో చేయనీ. ప్రతివస్తువు ఎప్పుడో ఒకప్పుడు ప్రతివస్తువు బ్రద్దలవక మానదు. (వెర్రిగ వెకిలినవ్వుతో) అమ్మీ! నీవు చెప్పింది నిజం!

పొరుగువాడు:- (పొరుగింటి కూలి హటాత్తుగా ప్రవేశము

తాడు) బాబూ! అది నిజం—పుకారు నిబద్ధయింది. అతనప్పుడే వచ్చాడు. (ఎంత హటాత్తుగ ప్రవేశిస్తాడో అంత హటాత్తుగ వెళ్ళిపోతాడు.)

కూలివాడు:- మనలను కూల్చేటందుకు గాయపరిచేటందుకు, జీవితాంతం వరకు పీల్చి పిప్పిచేసేటందుకు, వాళ్ల కొద్దిమంది, కొద్దిమంది నిరంకుశులు బయలుదేరారు, కాళ్ల చేతులు బంధించి దేహాలకు యంత్ర చక్రాలకు సంకెళ్లు వేశారు. గుర్రాలలాగు మనలను ఈసడింపుతో చూసి, కళ్లాలు తగిలించారు. గొర్రెల మందలలాగ తోలుతున్నారు. ప్రతి అవయవము శృంఖలా బద్ధమైంది. మనకు పుట్టబోయే సంతానం తల్లి గర్భము నుండి బయట పడినప్పుడే ముంజేతికి బరువైన గొలుసులతోటి, కాళ్లకు సంకెళ్ల తోటి పుట్టడం చూడాలని. ఈ నిరంకుశుల ఆశయం. మనని నోరులేని పశువుల మంద అని వాళ్లు పిలుస్తారు. కాని మన మేదడాకా చూపిద్దాము: మంద! నిజమే! ఒకసారి మనం ఉంటున్న ఈ వెల్తురు తగలని గొందుల్లోకి మురుగు వాసనలోకి వారిని రానీ. అప్పుడు ఈజాతి మూగదికాదని, గ్రుడ్డిది కాదని, ఉత్త పశుప్రాయులైన వారి అవసరం నిమిత్తం జన్మించలేదని తెలుసుకుంటారు. మంద, మానవులతోను ఆలు బిడ్డలతోను కూడుకొనినదని తెలుసుకుంటారు—ప్రతిజీవి ఒక మరణ దుంధుభిలాంటి గుండె గలవాడనీ, విజయముకొరకై ఉద్రూతలూగుతూ, సంసిద్ధమైయున్నాడనీ తెలుస్తుంది.

భార్య:- నాకర్థమవుతూంది. నాకర్థమవుతూంది నీవలనే...

కూలివాడు:- కూలివాడు ఆలోచనశక్తి ఉన్నవాడు. నవ్వగలడు కలలు కనగలడు. బాధ పడగలడు — ఇంతెందుకు వాళ్ళకంటే బాగా ప్రేమించగలడు. మూకు అవును. అది ఎప్పుడో ఒకప్పుడు విప్లవం తీసికొని వస్తుంది. అమ్మీ! సముద్రపు కెరటాలలాగ, వరదలాగ వస్తుంది. అప్పుడు వాళ్ళచేత పన్ను కట్టిద్దాము— హటాత్తుగ, ఎంతోకాలం నుండి, మృతజీవులమై ఉన్న మనం కళ్ల తెరచామని వాళ్ల వారేపు ప్రొద్దున్న తెలిసికుంటారు. అమ్మీ! మత్తుదకు దట్టకుదకు. నిరంకుశుడు చూపిన నిరంకుశత్వానికి మనం ధన్యవాదాలర్పించాలి. మనల్ని మత్తునిద్రనుండి లేపింది వాని నిరంకుశత్వమే. వాని సత్వంలో యంత్ర చక్రాలకు ఇంక మన బంధింపబడ నవసరముండదు. ఆ కొద్దిమందికే చెందిన యంత్రాల క్రింద మన హృదయాలు దేహాలు ఇంక నలిగిపోనవసరంలేదు. మనం దాడి వెడలి యంత్రాలను మన స్వాధీనంలోకి ఉంచుకుందాము. అప్పుడు తీరిక విశ్రాంతి యంత్రాలు కోటానకోట్లకు చెప్పుచేతల్లో ఉండే దానిసలవుతాయి. మంచిది—మనం కూపస్థ మండూకాలలా ఇంక జీవించ నవసరంలేదు. ఏమిటి! ఆ! స్వతంత్రము! మనకు! మనకుకూడానా! దరిద్ర పాదతాడిత కీటకాలు పాలిపోయి దాస్యవృత్తితో ప్రతి కేక కూలీలకి ఆకలి ధూమప్రాయులమూ గాలి గపోసికొని బ్రతకటానికి, ఎగరటానికి మనం ఏట కష్టదేవత! — నీవు కూడ రాత్రికనే భయంకర స్వప్నములాగ భయపెడుతున్నావు! అది సాధ్యమా? ఏమిటి! ఏమిటి నేనంటూన్నది! అమ్మీ నేను పిచ్చివాణ్ణయ్యానా? నేనేమి అంటున్నాను! ఆకలికి, దాస్యమునకు, రోగానికి దూరులమై వుంటామా?

భార్య:- అవును అలిసిపోయినావు. అబ్బీ! త్వరలోనే మనకి మంచిరోజులొస్తాయి!

కూలివాడు:- రావు! అవి చాలాదూరం!—మరి—మనం అలిసిపోయినాము! (చేతితో తాటుపోసిన తాళ్చిన్ని తుంచెను పట్టుకొని, ఒక మనిషి ప్రవేశిస్తాడు).

తాదుమనిషి:- ఇంత ఆశ్చర్యంగా వచ్చినందుకు విచార పడుతున్నా! మరి కిటికీ ఎక్కడుంది?

భార్య:- అతనెవరు? అతని కిక్కడేమి కావాలి?

కూలివాడు:- పుకారు నిజమైంది. అరేయ్. అదిగో అక్కడ కిటికీ—చక్కని కిటికీ, నీకు శాసనంమీద రోత పుట్టినప్పుడు కిటికీనుండి దుమికేటందుకు సరియైన కిటికీ.

(మిగతా 17 వ పేజీలో)

మద్రాస్ కౌన్సిలు చర్చలు

# జమీందారీ నివేదిక కమ్యూనిస్టు ప్రయత్నమట!

మదరాసు లెజిస్లేటివ్ ఎసంబ్లీ (క్రింది శాసనసభ)లో జమీందారీ విచారణ కమిటీ నివేదికను గురించిన తీర్మానం ఆమోదించబడిన తర్వాత లెజిస్లేటివ్ కౌన్సిల్ (పై శాసనసభ)లో జనవరి 30 వ తేదీని రెవెన్యూ మంత్రి ప్రకాశంగారు ప్రతిపాదించారు.

పెర్మనెంట్ సెటిల్మెంటు ప్రకారం భూమి శిస్తులు శాశ్వత నిర్ణయం పొందినాయనీ, జమీందార్లు రైతులవద్ద వసూలుచేసిన శిస్తును మూడు వాటాలుగా విభజించి, రెండు వాటాలను ప్రభుత్వానికి పేష్కష్‌గా చెల్లించవలసిందనీ మిగిలిన వాటాను శిస్తులు వసూలు చేసినందుకు వేతనముగా జమీందారు అనుభవించవచ్చుననీ. నిర్ణయించబడిందని రుజువు చేయడానికి రెంట్ రికవరీ బిల్లులోని 10 వ క్లాజు, పట్టా రెగ్యులేషన్‌లోని 7, 9 క్లాజులు, 1898 వ సంవత్సరంలో ప్రతిపాదించబడిన బిల్లు మొదలైన ఆధారాలను విపులంగా తెలియజేశారు. 1908 లో ప్యాసైన ఎస్టేట్సు ల్యాండ్ ఆక్టు ఏవిధంగా లోపభూయిష్టమైనదో నిరూపించారు.

మరునాడు చర్చ ప్రారంభమయింది. నివేదికలో మెజారిటీ సభ్యుల సూచనలను ఆధారముగా చేసుకొని త్వరలో ఒక శాసనం ప్రవేశపెట్టవలసిందని వి. వి. జోగయ్యపంతులు గారు సవరణను ప్రతిపాదించారు. పిమ్మట బి. నారాయణస్వామినాయుడుగారు అగ్రహారం గ్రామాలు సెటిల్మెంటుకు పూర్వపువి అయినా, తరువాతవి అయినా, వాటిని జమీందారీ గ్రామాలతో సమానంగా భావించాలనీ, యీనాము భూముల విషయంలో మెజారిటీ కమిటీవారి సూచనలు ఇంతవరకూ రైతులకీయబడిన హక్కులకు విరుద్ధముగా ఉన్నవి కాబట్టి వాటికి సమ్మతింప కూడదనీ, రైత్వారీ సూత్రములపై జమీందారీ భూములు కూడా సర్వే చేయించి, శాశ్వతమైన రేట్లు నిర్ణయించాలనీ; ప్రస్తుతము అమలులో ఉన్న రేట్లు అట్టి రేట్లకంటె తక్కువ అయితే యిప్పటి రేట్లే శాశ్వతమొనర్చవలెననీ—ఒక సవరణను ప్రతిపాదించారు. భూమి ఎంత పండుతుందో, ఎటువంటి పంటలు పండిస్తున్నారో, పంటల దర ఏవిధంగా ఉన్నదో విచారించిన మీదటనే 1802 రేట్లు ఖాయపరచడం న్యాయమని తెలిపారు. రైతులలో రెండుతెగలు ఉండడము ఎట్టి న్యాయం అని ప్రశ్నించారు. ఎ. రంగస్వామి అయ్యంగార్ కూడా యీ ధోరణిలోనే ఉపన్యసించారు.

పిమ్మట మహమ్మద్ ఉస్మాన్‌గారు ఉపన్యసిస్తూ, ఉభయపక్షాలకూ న్యాయమైన పరిష్కారమార్గం కనపరచాలని విన్నవించారు. ఈ నివేదికను ప్రభుత్వం అమలుపరిస్తే జమీందార్లు చెడిపోకుండాను, రైతులకు జీవితసౌకర్యములు అధికమయే రీతిని, ప్రభుత్వం ఇక మధ్యమార్గం అవలంబించాలన్నారు. అదే జమీందార్లకు న్యాయమైన నష్టపరిహారం యివ్వడమన్నారు. పిమ్మట జె. ఎ. సాల్డానాగారు, యితరులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా వాదిస్తూ ఉపన్యసించారు.

### కమ్యూనిస్టు ప్రయత్నం

ఈ నెల 2 వ తేదీని జరిగిన చర్చలో సర్. కె. వి. రెడ్డినాయుడుగారు మాట్లాడారు. కమిటీ నివేదికయందలి సూచనలు పూర్తిగా విప్లవ జనకములు కాబట్టి వాటిని తాము నిరసిస్తున్నామన్నారు. జమీందార్లు 150 సంవత్సరాలనుంచీ అనుభవిస్తూన్న హక్కులను యీ నివేదిక ఒక్కదెబ్బతో కొట్టివేయదలంచినదన్నారు. ఇది వరకటి ఋణవిమోచన చట్టమువల్ల దెబ్బతిన్న జమీందారులకిది గొడ్డలిపెట్టువంటిది. దీనివల్ల సంఘ నిర్మాణం అంతా చెడిపోతుంది. దేశాన్ని జయించినది బ్రిటిషువారు. కనుక వారికి భూమిని పరిష్కారంచేసే హక్కు కలదు. ఆ అధికారము ననుసరించి జమీందార్లకు భూమి వినియోగహక్కును ప్రసాదించారు. ఇంతేగాక, బ్రిటిష్‌వారు రాకపూర్వమే అనేకమంది జమీందార్లు భూమిపై యాజమాన్యమును సంపాదించారు. నేడు వారిని "పన్నులు వసూలుచేసే వ్యక్తులు" అని పిలువడం చాలా అన్యాయం. మీరు గౌరవప్రదంగా వర్తించినట్లయితే, మీతో నేను చేరుతాను. జమీందారీ విధానాన్ని రద్దు చేయండి. నిష్పక్షపాతమైన విచారణ కమిటీని నెలకొల్పి, వారు తీర్మానించు ప్రకారం నష్టపరిహారం యిప్పించండి. అదే గౌరవమైన పద్ధతిగాని, యీ నివేదిక కాదు... ఈ నివేదిక యితరుల హక్కులను లాగివేసి, నష్టపరిహారము యివ్వకుండా ఆస్థులను స్వాధీన పరచుకొనే కమ్యూనిస్టు ప్రయత్నం. మాస్కోలో జరిగినది మళ్లా మన దేశంలో జరుగుతుంది. అనేకమంది పస్తుపడి, ప్రాణత్యాగం చేయవలసివస్తుంది. నేరాలు పెరిగిపోతాయి. రైతుల దగ్గరనుంచి కూడా యికముందు ప్రభుత్వము భూములను స్వాధీనపరచుకోదని యేవిధంగా చెప్పగలము? ....నాలుగు రోజుల క్రిందటనే అతివాద పక్షానికి చెందిన సుభాష్ చంద్రబోసుగారు కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. దీనినిబట్టి క్రమంగా కాంగ్రెసు సామ్యవాదంలోకి మళ్లుతోందని స్పష్టమవుతోంది—కాబట్టి యీ ప్రయత్నం సామ్యవాద ప్రయత్నాలకు సహాయపడుతోందని రెడ్డినాయుడుగారు ఉపన్యసించారు.

చర్చలో యితరులు పాల్గొన్న తరువాత, ప్రధాన మంత్రి, రెవెన్యూ మంత్రిగారలు తగిన రీతిని జవాబిచ్చారు.

# ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ కార్యవర్గ సమావేశము

ది 30-1-39 వ తేదీన కాకినాడలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సభ ప్రతినిధుల బసలో జరిగిన ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశములో ఆమోదింపబడిన తీర్మానములు.

1. మద్రాసు ఎస్టేటులాండు ఆక్టు విచారణ సంఘ నివేదిక చర్చ సందర్భమున, శాసనసభవారున్నూ, ప్రధాన మంత్రిగారు జమీందారులంతా ప్రభుత్వోద్యోగుల హోదానే కల్గినవారనియు, పనికిరాని పబ్లిక్ సర్వెంటుల నెటుల తొలగించదగునో అటులనే జమీందార్ల పెత్తనాన్ని తొలగించుటకు కూడ ప్రభుత్వమునకు పూర్తియైన హక్కున్నదని అంగీకరించినందువలన సాధ్యమైనంతలో జమీందారీ విధానమును తొలగించుట ప్రభుత్వ ధర్మమని యీ సంఘంవారు ప్రభుత్వమును కోరుచున్నారు.

శాసన సభవారు కోరినట్లు ప్రభుత్వము ప్రకాశం కమిటీ నివేదిక ననుసరించి శాసనము గావించే లోపల జమీందార్లు రైతుల నుండి అక్రమ వసూళ్లు చేయకుండగను, అడవుల ఛేదించి అడవుల నాశన మొనర్చకుండగను, సాముదాయక భూములను ఆక్రమింపకుండగను, బంజరు భూముల తమ బంధువులకు కాపులకు అన్యాక్రాంతము చేయకుండగను తదితరమైన రైతుల హక్కులను అన్యాయముగ అపహరించకుండగను రైతులందరి తరఫున ప్రభుత్వమే జమీందారీ ప్రాంతములోని అడవులు, జలాశయములు, బంజరులు, సాముదాయక భూములు మొదలగువాటిని రక్షించుటకుగాను తాత్కాలిక శాసనము చేయవలసినదిగా కోరుచున్నారు. అట్లు చేయుచో ప్రభుత్వ శాసనము అమలు అయ్యేలోపలనే రైతులకు ముందురాబోయే శాసనమువలన ప్రభుత్వము తలపెట్టిన సౌకర్యములు పూర్తిగ లభింపజాలవని ప్రభుత్వమునకు యీసంఘమువారు తెలియజేయుచున్నారు.

శాసనసభ వారిచే అంగీకరింపబడిన ప్రకాశం కమిటీ నివేదిక ననుసరించియు, సంఘమిదివరలో ప్రకాశం కమిటీ నివేదికకుచేసిన సూచనల ననుసరించియు, ఆలస్యము చేయక తప్పక ఏప్రియల్ మాసములో ఒక ప్రత్యేక శాసనసభా సమావేశము జరిపి ఆ సమావేశములో మద్రాసు ఎస్టేటు లాండు రివిన్యూబిల్లును పెట్టి త్వరలో శాసనము చేయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నాము.

2. జమీందారీ రైతు రక్షణ వారములో ఆంధ్రదేశమంతటా ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ సూచనలతో ప్రకాశం కమిటీని బలపరచుచు అనేక రైతు యాత్రలు, సభలు జరిపి రైతాంగ అభిప్రాయమును ప్రభుత్వమునకు శాసన సభ్యులకు తెలియపర్చి నందులకు ఆంధ్ర రైతాంగమును, రైతు సేవకులను యీ సంఘమువారు అభినందించు చున్నారు.

పైవారములో యాత్రలలో స్థానికాధికారులకు రైతులిచ్చిన వివిధ అర్జీలు, మెమొరాండములలో స్థానిక యిబ్బందులనుగూర్చి వెంటనే తామేవిధమైన చర్య గైకొనునదియు తెలియపర్చుమ, ఆయా స్థానికాధికారులు ఆయా జిల్లా రైతు సంఘములకు వెంటనే తెలియపర్చవలసినదిగా ఈ సంఘమువారు స్థానికాధికారులను కోరుచున్నారు.

3. యీనాం రైతులు:—మద్రాసు ఎస్టేటు లాండు ఆక్టు విచారణ సంఘ నివేదిక చర్చా సందర్భములో యీనాం రైతుల రక్షణగూర్చి మద్రాసు ప్రభుత్వము యేవిధమైన వాగ్దానము చేయకుండుటచే యీనాం రైతులకు నేడున్న కష్టాలు మరింత హెచ్చుగుననియు, యీనాం రైతులలో తీవ్ర అసంతృప్తి గల్గినదనియు, యీ సంఘమువారు ప్రభుత్వమునకు తెలియపర్చుచు, యీనాం రైతుల విషయములో ప్రభుత్వము ముందేమి చేయునున్నదియు వెంటనే తెలియపర్చ వలెననియు, కనీసం యిప్పుడున్న యీనాం రైతుల హక్కులకన్న ముందు ప్రభుత్వము చేయబోయే శాసనము కొరవడదని స్పష్టముగానైన ప్రకటనచేయుట ప్రభుత్వ కనీస ధర్మమని యీ సంఘమువారు అభిప్రాయపడుచున్నారు.

ప్రకాశం కమిటీ నివేదికవలన గల్గిన అసంతృప్తితో నిస్పృహచెందక యీనాం గ్రామములలో తమకు యిప్పటి శాసనము ప్రకారం తమకున్న హక్కులను నిలబెట్టుకొనుటకును యికముందు ప్రకాశంకమిటీ నివేదిక ప్రకారం జమీందారీ రైతులకు సంక్రమించే సకల హక్కులు తమకుగూడ సంక్రమింపచేసుకొనుటకును తీవ్రకృషి చేయవలసినదిగాను, అందులకు నిరంతరము ఆందోళనము గావించవలసినదిగాను యీనాం రైతులను యీ సంఘము వారు హెచ్చరించుచున్నారు.

4. జమా—ఖర్చులు:—ది 20—11—38 తేదీ మొదలు ది 27—1—39 వరకు అయిన రాష్ట్ర సంఘ జమా ఖర్చుల వివరమును తెల్పు ప్రధాన కార్యదర్శి ఆర్థిక నివేదికను పరిశీలించి ఏకగ్రీవముగా ఆమోదించడమైనది.

5. చిత్తూరుజిల్లా చదుము గ్రామ ప్రాంతముల రైతుల, కూలీలపై పోలీసులు, సాహుకార్లు, భూస్వాములు ప్రయోగించుచున్న నిర్బంధవిధానమును ఖండించు ఆ నిర్బంధ విధానమునకు గురియైన రైతుకూలీలను, రైతు సేవకులను యీ సంఘమువారు అభినందించుచూ అట్టి నిర్బంధ చర్యలవిషయమై నిష్పాక్షికమైన విచారణ జిల్లా అధికారులు జరిపించవలసినదిగాను, అచ్చటనున్న అశాంతిని త్వరగా తొలగించవలసినదిగాను యీ సంఘమువారు జిల్లా అధికారులను హెచ్చరించుచున్నారు.

ఇట్లు,

బెజవాడ, 31-1-39. } చలసాని వాసుదేవరావు, ఆ॥ రా॥ రైతుసంఘం.



# కాంగ్రెస్ పైనే సహాయనిరాకరణమా?

## అధ్యక్షుని ఎన్నికపై మహాత్ముని వ్యాఖ్య.

కామ్రేడ్ మద్దుకూరి చంద్రశేఖరరావు

ప్రజాస్వామిక సంస్థలలో ఎన్నికలు సర్వసామాన్య విషయాలు. ఎన్నికలముందు సిద్ధాంత కార్యక్రమాలపై పోటీ చేయు ఆయా పార్టీలవారు ఎంత పట్టుదలతో ఎన్నిక ప్రచారం గావించినా ఎన్నికల అనంతరం గెలుపొందినవారికి అభివందనాలు తెల్పి, సంస్థ కార్య క్రమాన్ని అందరూ కలసి జయప్రదం గావించడానికి శక్తినంతను ధారబోయుట వీరోచిత లక్షణము. అందునా కాంగ్రెసువంటి సంపూర్ణ స్వాతంత్ర్యమే ఏకైక లక్ష్యంగా కల్గిన ప్రజా సంస్థలలో అది తప్పనిసరి. ఒక పదవికొరకు పోటీచేయుట ఆసంస్థలో పనిచేయు ప్రతివానికీ హక్కు. అటులే ఎన్నికానంతరము అందరూ కలసి సంస్థ నిర్ణయించిన కార్యక్రమాన్ని అమలు జరుపుట కాంగ్రెసువాదులందరి యొక్క కర్తవ్యం.

కాంగ్రెసు అధ్యక్ష ఎన్నికలలో ఇదివరకు కాంగ్రెసులో అధికారంలోవున్న వల్లభాయి ప్రభృతుల అభ్యర్థి డాక్టరు పట్టాభిగారు ఓడి, బోసుగారు గెల్పుటను కాంగ్రెసు పెద్దలు ఉదార దృష్టితో వీక్షించకపోవుట విచారకరము. ఇందుపై గాంధీ మహాత్ముడు చేసిన ప్రకటనను గురించి చర్చిద్దాము.

గాంధీజీయే పట్టాభిగారిని ఉపసంహరించుకోకుండా చేసారు గాన పట్టాభిగారి ఓటమి తనఓటమియే అంటున్నారు. 1934 లో కాంగ్రెసు నిబంధనలో మార్పులు గాంధిగారి సూచనలపైనే కావించారు. ప్రజాభిప్రాయాన్ని సూచించుటకు ప్రతినిధులే అధ్యక్షుని ఎన్నుకోవాలని నిర్ణయించబడింది. మరుసటి సంవత్సరం డా॥ పట్టాభిగారు జవహర్లాల్‌గారితో పోటీచేస్తూ కొత్తగా ఏర్పాటు చేయబడిన ప్రజాస్వామిక సూత్రాలను అమలు జరుపుటకే పోటీ చేస్తున్నానని తెలవిచ్చారు. అటులే నేటి ఎన్నికను కూడ వీక్షించాలి. అటులగాక మహాత్ముడు సుభాసును తన స్వంత వర్కింగు కమిటీనే ఏర్పాటు చేసుకోమనడం పొరపాటు. ఇదివరకు మితవాదులు అత్యధిక సంఖ్యాకులుగా వున్నపుడు, అతివాదులయిన బోసు, నెహ్రూ, జయప్రకాశ్ నారాయణ, నరేంద్రదేవులు వర్కింగు కమిటీలో వుండి సహకారము చేయలేదా? అటులే ఇపుడు అతివాదులు హెచ్చుగా వున్నా వర్కింగు కమిటీలో మితవాదులుండి సహకారము చేయాలి. నాయకులైన సైనికులకు ఆజ్ఞ యివ్వగలవారు తాము సైతం సైనికులై నాయకుల ఆజ్ఞలను నెరవేర్చగల్గి వుండాలి. అదియే వీరత్వము.

గాంధిజీ తన పాలసీకి ఓటమి వచ్చిందిగాన, మితవాదులు సుభాసు కార్యక్రమాన్ని అంగీకరించనిచో బయటికి వచ్చి, తమచేతనైన విధాన కాంగ్రెసుకు సేవ చెయ్యాలంటున్నారు. ఇది మరీ చిత్రము, విషాదకరము. కాంగ్రెసులో స్వాతంత్ర్యముకొరకు పోరాడేవారందరికీ తావుంట. కాంగ్రెసు ప్రాణాధారము స్వాతంత్ర్యకాంక్ష. అట్టి కాంక్షగలవారందరూ కాంగ్రెసులో వుండి అది నిర్ణయించు కార్యక్రమాన్ని సైనికులవలె అమలునందుంచాలి. నేటివరకు అతివాదులను, సోషలిస్టులను కాంగ్రెసు పెద్దలూ ఆదే కోరారు. నేడు వారిని సుభాసుచంద్రబోసు, కాంగ్రెసూ కోరేది అదియే. మహాత్ముడు, ఈ ఎన్నిక ఫలితంగా పార్లమెంటరీ కార్యక్రమంలో మార్పు రావచ్చుననీ, మంత్రులు, "తామంగీకరించిన కాంగ్రెసు కార్యక్రమంకొరకు పదవులు వదలుకొన్నా లేక కాంగ్రెసు పాలసీని తామంగీకరించక రాజీనామా యిచ్చినా" స్వల్పమాత్ర భేదమేనంటున్నారు. ఇది మంత్రులు, "మా యిష్టం వచ్చినట్లు చేస్తాం మీ రంగీకరించండి. లేదా మీ యిష్టమైనట్లు చేయమంటారా మేము రాజీనామా యిస్తా" మని బెదరించుటకు పనికివస్తుంది. ఇట్టి ప్రోత్సాహాన్ని మహాత్ములే యిచ్చుట అన్నిటికంటె సోచనీయము.

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక ఉంది. దాని ఘోషణ అంగీకరించియే ప్రజలు కాంగ్రెసు ప్రతినిధులను శాసనసభలకు పంపారు. దాని ఫలితమే నేటి మంత్రి పదవులు. నేటి కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నికలు ఆ స్థితిని ఏమీ మార్చలేదు. జరిగిన మార్పల్లా ఎన్నికల ప్రణాళికను, ఫైజ్‌పూర్ కార్యక్రమాన్ని అమలుజరుపుటకంటే కాన్స్టిట్యూషన్ వైపు మొగ్గుచున్న మోజుకు వ్యతిరేకంగా కాంగ్రెసు ప్రతినిధులు ఓటు చేయుట. ఫెడరేషనుపై బ్రిటీషు సామ్రాజ్యవాదులతో ఏవో స్వల్పమైన మార్పులతో సుముఖత్వం జూపుచున్న భూలాభాయి సత్యమూర్తి ప్రభృతులు వ్యక్తపరుస్తున్న దృక్పథానికి వ్యతిరేకత చూపుట. స్వల్పంగా పటేలు ప్రభృతులు నియంతలవలే ప్రవర్తించడం, బోసును తిరిగి యెన్నుకోడం "దేశానికి అపాయకరం" అను పటేలు తెలివితక్కువ ఆరోపణలు కూడ, బోసు విజయానికి కారణం గావచ్చు. అంటే మొత్తంగా చూస్తే ఫైజ్‌పూర్ కార్యక్రమం, ఎన్నికల ప్రణాళికను అమలు జరుపడానికి చూపుచున్న జంకుకు, ఫెడరేషన్ విషయమై రాజీ సమాలోచనలు తలపెట్టు పార్లమెంటరీ వాదులకు, వ్యతిరేకతను ఎన్నిక వెల్లడి చేస్తోంది. ఇంతవరకు కాంగ్రెసులోని ఏ వర్గము, మితవాదులు సైతం బహిరంగంగా పై సంగతులు ఒప్పుకొనుట లేదు. అందుచే ఈ ఓటమి మితవాదుల ఓటమి అనుటకంటే దిగజారుడు పాలసీకి ఓటమిగాను, అడ్డంకులెంచితే బాగుంటుంది. ప్రజా ఉద్యమాన్ని, ఖాసిస రాజ్యాంగ్య వ్యతిరేక పోరాటాన్ని బలపరచడానికి, మంత్రివర్గాలు ఎన్నిక ప్రణాళికను అమలు జరుపుటకు తీవ్ర కృషి చేయాలని కాంగ్రెసు ప్రతినిధులు యిచ్చిన హుకుంగా యెంచాలి. అంతేగాని ఎవరూ కాంగ్రెసు నుండి అలిగి బయటికి వెళ్ళాలిసిన అవసరం లేదు. అటుల చేయుట స్వాతంత్ర్య పోరాటములో చీలికలు కల్పించుటయే. జాతీయ ఐక్యతను భంగపరచుటయే. కాన గాంధీజీ, వారి పక్షంవారు దీని విషయమై తిరిగి ఆలోచించాలి.

ఈ సందర్భంలోనే గాంధీజీ కాంగ్రెసులోని కుళ్లు సంగతి తెచ్చారు. కుహనా సభ్యత్వమువల్లనే ఇపుడు కాంగ్రెసు ప్రతినిధులయినవారు చాలమంది వున్నారనడం చాల అసంగతమైన విషయం. ఇందులో ఒక విధముగా బోసు జయం యిట్టి ప్రతినిధులపైనే ఆధారపడినదని అనుఅక్రమ ఆరోపణ కూడ ఉంది. దేశ మొత్తం మీద కాంగ్రెసు సంఘాలు యిపుడు గాంధీ అనుచరుల చేతుల్లోనే వున్నాయి. సభ్యత్వంలో కుళ్లువుంటే వారే బాధ్యులు. అతివాదులు చేర్పించిన సభ్యత్వం వడపోతలు పోసిగాని అంగీకరించ బడుటలేదు. అందుచే కుహనా సభ్యత్వంవల్ల ఎన్నుకోబడువారు మితవాదులు చెప్పునటుల చేస్తారేగాని బోసుకు ఓట్లు చేయరు; చేయలేరు. ఇతరులపై యింత దుమ్ము విసరాలని చేసిన యీ ఆరోపణ గాంధీ అనుచరులకే తగులుతోంది.

గాంధిగారు యీ ప్రకటనలో అక్టోబరు 15 వ తేదీ హరిజన్‌లో వ్రాసిన వ్యాసాన్ని ఉదహరించారు. అపుడు ఢిల్లీ అఖిల భారత కాంగ్రెసు కమిటీ సభలో మితవాదులు రైతు, కార్మిక ఉద్యమాల్లో పనిచేయువారికి యిబ్బంది కలుగునటుల పౌరసత్వ హక్కుల సంకుచిత పరచు తీర్మానాన్ని ఉపపాదించారు. అతివాదులు తీర్మానాన్ని ఉపసంహరించుకోమని వాదించి అసమ్మతి తెలుపుటకు సభనుండి బయటికి వెళ్ళారు. బయటికి వెళ్లటను గాంధీజీ నాడు నిరశించారు. నేడు తమ ప్రతినిధి నెన్నుకోలేదు గాన మితవాదులే కాంగ్రెసు బయట ఉండాలిసి వస్తుందంటున్నారు. అపుడూ అతివాదులు, కమ్యూనిస్టులు, సోషలిస్టులు కాంగ్రెసునుండి తీవ్రవాదులను, ప్రజా వుద్యమాలలో పనిచేయువారిని తరిమివేయు ప్రయత్నాలను నిరశించారు. ఇపుడు మితవాదులు సహకారాన్ని మాని కాంగ్రెసునుండి వెళ్ళిపోతామనడాన్ని నిరశించుతారు. ఏమంటే వారు మితవాదులను సైతం కాంగ్రెసులో ఉండాలనే కోరుతున్నారు. స్వాతంత్ర్యం కోరుతూ, అందుకొరకు పోరాడటానికి సిద్ధంగావున్న భారతీయుల నందరినీ కాంగ్రెసులో ఉండాలని కోరుతారు. సమిష్టిగా ఆలోచించి, మెజారిటీ అంగీకరించిన కార్యక్రమం ద్వారా కాంగ్రెసువాదులందరు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి ప్రయత్నించాలని కోరతారు. బోసుగారన్నటుల అతివాదులు కార్యక్రమం "జాతీయవాదులలో ఐకమత్యం కావాలి. ఫెడరేషను ప్రతిఘటించాలి. ప్రజాస్వామిక సిద్ధాంతాలను అనుసరించాలి". అందుచే కాంగ్రెసులో చీలికలు అతివాదులు కోరరు. మితవాదులనుకూడ చీలికలు కల్గించరాదని కోరుతారు.

ఆంధ్ర కాంగ్రెసువాదులంతా విశాల దృష్టితో గాంధీగారి ప్రకటన పరిశీలించాలని కోరుతున్నాను. మహాత్ములు చెయిదములు "అనన్య సామాన్యం, అచింత్యం హేతుకం" అని తలంపక స్వతంత్ర్య పోరాటానికి అపకారియేమో ఆలోచించాలి. ఖద్దరు స్వరాజ్యము సాధనం కాదనువారు కూడ వుండి కాంగ్రెసుతో ఖద్దరు కట్టి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనుటలేదా? స్వాతంత్ర్య పోరాటంలో అహింసను మత విశ్వాసంగా అంగీకరించనివారు కూడ కాంగ్రెసు కదన రంగంలో ముందజ వేయుటలేదా? అటులే కాంగ్రెసులో అతివాదులకు మెజారిటీ వచ్చినా (మెజారిటీ ఇంకా రాలేదు) గాంధీవాదులు కాంగ్రెసునుండి వెడలుట సబబుకాదు. తాము అధికారంలో వున్నప్పుడు శుద్ధి పేరుతో (Purge) అతివాదులను కాంగ్రెసునుండి తరుముట ఒక నేరము. అతివాది తమ్ము ఎదిరించి కాంగ్రెసు అధ్యక్షుడయ్యాడని తాము బహిష్కరించుట మరియొక నేరము.

గాంధిగారు, వారి అనుచరులు స్వాతంత్ర్య పోరాటానికి వినాశ కారణమైన చీలికలు తేరాదు. సహాయనిరాకరణ ఆయుధాన్ని కాంగ్రెసుపైనే ప్రయోగించరాదు. ఇది మా హృదయపూర్వకమైన కోర్కె.

# సంస్థానాల్లో సామ్రాజ్యవాదుల దాడిని ఎదుర్కోండి!

## 'నేషనల్ ఫ్రంటు' సంపాదకీయము.

మన సంస్థాన ప్రజా పోరాటంలో ఒక నూతన ఘట్టమారంభమైంది. క్లిష్ట పరిస్థితుల మధ్యనున్న మనకిప్పుడు కావలసినవి రెండు: (1) స్పష్టమైన దృక్పథము (2) ధైర్యము గల నాయకత్వము.

సామ్రాజ్యవాదులు అవలంబించుచున్న కప టోపాయము, కాంగ్రెసుతో మచ్చిక చేసుకుని కాంగ్రెసును ప్రజా పోరాటమునుండి దూరము చేసి, కాన్‌స్టిట్యూషను బోనులో బంధించడానికే ఈ కపట నాటక మప్పుడే కాంగ్రెసు నాయకులలో, సంస్థానాధీశులకి, ప్రజలకి జరుగుతున్న పోరాటంలో కలుగజేసుకోరాదనే దుర్బుద్ధిని కలిగించింది.

ఈ దుర్బుద్ధియే హరిపుర కాంగ్రెసులోని సంస్థాన పోరాటాలలో కాంగ్రెసు జోక్యము కలిగించుకోకూడదనే తటస్థ తీర్మానానికి కారణము. అంతేకాదు, కాంగ్రెసుకున్న అపారమయిన పలుకుబడివల్లను, గౌరవమువల్లను సంస్థాన ప్రభువులతో రాయబారాలు నల్పి, ప్రజలకు ప్రజా స్వామ్య హక్కుల నిప్పించవచ్చుననే వింత మార్గాలుకూడ అవలంబించుతోంది మన నాయకత్వం.

హరిపురాలో నిర్ణయించిన తటస్థ విధానం కాగితంమీదనే వుండిపోవలసివచ్చింది. ప్రజల ఉదాసీనతను కొలతలుకొలచి మన నాయకులు వేసిన లెక్కలన్నీ ఎగిరిపోయాయి. ప్రతి సంస్థానంలోను ప్రజాపోరాటాలు బయలుదేరాయి. చాలమంది కాంగ్రెసువారు పోరాటాలలో పాల్గొనక తప్పలేదు. చివరకి రాజకోట పోరాటానికి పటేల్ నాయకత్వం వహించడంతో ఆ తటస్థ విధానం అంతమొందింది. హరిపురకాంగ్రెస్‌లో ఈవిధానాన్ని సమర్థించిన మొనగాడే యిప్పుడు, త్రిపురికాంగ్రెస్ సమయానికి, దానినిఉల్లంఘించి తుదముట్టించాడు!

ప్రజా చైతన్య జ్వాలలు ప్రజ్వరిల్లాయి. పోరాటాలు ఒక్కొక్క సంస్థానాన్నే ఆవరించాయి. కునుకుదీసిన సామ్రాజ్యవాదం కళ్ళు నులుముకు చూసింది. వెంటనే తన కత్తిని ఒర నుండితీసింది. కాంగ్రెసువారి తటస్థవిధానం సామ్రాజ్యవాదులకు అవకాశమిచ్చింది. తమ అధికార బలాన్నంతటినీ ఉపయోగించి సంస్థానాధీశులకు దోహదమివ్వడానికి ప్రారంభించారు. సంస్థానప్రజలకు బ్రిటీష్ సామ్రాజ్యవాదులకు మధ్యనున్న తెరతొలగింపబడింది. ప్రజలు బ్రిటిష్ తుపాకులను బహిరంగంగా ఎదుర్కోవలసివచ్చింది. అయినా ప్రజలు ముందుకు సాగిపోతూనే వున్నారు.

రాజకోటలో ఠాకూర్ సాహెబ్ సంస్థానాధీశుల సమావేశమైన తరువాత, అదివరకు పటేల్‌తో తాను చేసుకొన్న ఒడంబడికను తిరస్కరించాడు.

జమ్నాలాల్ బజాజ్ జయపూర్ రాజ్యాన్ని సికార్ ప్రజల తిరుగుబాటునుండి రక్షించాడు. కాని ఈ ఒడంబడిక కూడ భగ్నము గావింపబడింది. జమ్నాలాల్ జయపూర్ సంస్థానంలోనికే రాకూడదని శాసింపబడింది. (దీనిని ఉల్లంఘించినందుకు ఆయనను అరెస్టుచెయ్యడం, వదలివేయడంకూడా జరిగాయి.) జమ్నాలాల్ అధ్యక్షుడుగా వున్న ప్రజామండలి అక్రమ సంఘమని నిషేధింపబడింది.

తిరువాన్కూరులో నిర్బంధవిధానం క్రొత్త పోకడల నవలంబించింది. దివాన్ కోరినట్లు, ఆరోపణలను ఉపసంహరించుకోమని సంస్థాన కాంగ్రెసువారికి మహాత్ముడు సలహాయివ్వడం వారట్లు చేయడం జరిగాయి. బాధ్యతాయుత ప్రభుత్వం ప్రసాదింపకపోగా అంతవరకు కార్మికులమీద, విద్యార్థులమీద, యువజనసంఘాల మీద ఎక్కువజేయబడిన నిర్బంధవిధానం కాంగ్రెసు మీదికి కూడ ప్రాకించారు.

ఒరిస్సా సంస్థానాలలో సామ్రాజ్యవాదపు జోక్యం, గ్రుడ్డివానికి సహితం కనబడేటంత స్పష్టంగా వుంది. భారత సైన్యంనుండి 1200 సోల్జర్లను కటక్‌లో పెట్టారు. చుట్టుపట్ల సంస్థానాలకు ఎంతెంతమంది కావలిస్తే అంతమందిని పంపుతున్నారు. సంస్థానాధీశుల రక్షణచట్టాన్ని అమలు జరుపమని కాంగ్రెసు మంత్రులమీద ఒత్తిడి ఎక్కువైంది.

ముందు నడవవలసి వస్తోంది. ఈ ఉద్యమానికి నానాటికి బలం ఎక్కువౌతోంది. సామ్రాజ్య వాదం ఈ సంగతి గ్రహించింది. ఈ ఉద్యమం కాంగ్రెసు జాతీయోద్యమంతో కలసి, వంచించడానికి అసాధ్యముకాక మునుపే దానిని త్రుంచి వేయడానికి నిశ్చయించుకుంది.

బ్రిటిషు సామ్రాజ్య వాదుల ఫెడరల్ భవనానికి ఆధారమైన, సంస్థాన ప్రభువుల నిరంకుశ విధానము నాశనము గావించబడుతూంటే వారెట్లు చేతులు ముడుచుకుని కూర్చోగలరు?

ఈ హానిని తలబెట్టడానికి సామ్రాజ్య వాదులకు ధైర్యం మన బలహీనతను గుర్తించడం వల్లనే గలిగింది. మన పెద్దలలో ప్రబలుచున్న కాన్‌స్టిట్యూషనల్ స్వభావం మన శత్రువులు గ్రహించారు. ఘోరమైన నిర్బంధ విధానాన్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు కాంగ్రెసు వెనుకకు జంకి పోతుందని వారి ఆశ వారి తంత్రం ఎంత సేపూ. కాంగ్రెసు ఐక్యతను భగ్నం చేయాలని, లేదా. కనీసం తనకడ్డం రాకుండా నైనా చేసుకోడానికి.

ఇది వాస్తవమైన అపాయం. ఎందుకంటే

బాజీరావుట్ (12 ఏళ్ల బాలుడు) హుస్‌రీ పధాన్.

దేంకానల్‌లో అత్యాచారాలు సాగించి పోలీసులు వెళ్లిపోతాంటే వారికి పడవలను ఇవ్వడానికి నిరాకరించి, వారితో పెనగులాడి ఎట్టకేలకు వారి తుపాకి గుండ్లకు బలియైన వీరులు.

ఇవన్నీ మనకు సంబంధములేని సంఘటనలుకావు. సామ్రాజ్యవాదం తలపెట్టిన మరొక ఉపద్రవచ్ఛాయలు. ఒక రాజకోట ఠాకూరే కాంగ్రెసు పటేలును తిరస్కరిస్తూ తలుపులు మూసివేయలేడు. ఒక జయపూరు ప్రభువు తనంతటతాను కాంగ్రెసు కోశాధిపతి రాకను నిషేధించడానికి ధైర్యం చేయలేడు! మొదట్లో తోకముడిచిన ఒరిస్సా గవర్నరు, ఇప్పుడు సంస్థానాధీశుల రక్షణ శాసనాన్ని అమలు జరపమని కాంగ్రెసు మంత్రులమీద నిష్కర్షగా ఒత్తిడి తేగలిగి వుండేవాడా?

కాదు. ఇండియా గవర్నమెంటుయొక్క రాజకీయ శాఖ, తన పశు బలాన్నంతటినీ ఉపయోగించి సంస్థాన ప్రజా పోరాటాన్ని రక్త ప్రవాహాలతో ముంచెత్తడానికి, కాంగ్రెసు మంత్రుల చేత ఆఫీసులలో బంట్రోతు చాకిరీ ఎంత చేయించుకో గలిగితే అంతా చేయించుకోడానికి పన్నిన కుట్రను అమలు జరపడమే!

సంస్థాన ప్రజా ఉద్యమ మహా తరంగం విజృంభించి అడ్డువచ్చిన దానినెల్ల కొట్టుకొని పోతూంది. ప్రముఖ కాంగ్రెసు నాయకులు దాని గాంధిగారు హరిజనలో ఇల్లా వ్రాశారు.

"సంస్థానాధీశులు, కేంద్రప్రభుత్వము కలసి ఒక సంయుక్త కార్యవిధానాన్ని నిశ్చయించుకునే సమయంవచ్చింది. ఒకవేళ నాతో కొందరు చెప్పినట్లు జయపూరు విధానమే అట్టిదని అంటారా? నేనది కాదని తలుస్తాను" గాంధిగారి ఈ పవిత్ర తలపులు వాస్తవాలకు విరుద్ధం. ఆయన ఇంకా ఇట్లావ్రాశారు. "నేను అసంభవాలను ఆశిస్తున్నాను జయపూరు అధికారులు దీని అఖిలభారత సమస్యగా చేయడానికి భయపడతారు." ఇది గాంధిగారిభాషలో, కాంగ్రెసు కలుగజేసుకుంటుందని హెచ్చరించడం. కాని ఈ అందనిపండ్లకు అర్రులు చాచుచున్నంతవరకు మనం వెనుకబడియే వుంటాం. సామ్రాజ్యవాదులు ముందంజవేస్తారు. ఈ విధానం పోరాటంలో మన జయాన్ని అనుమానాస్పదం చేస్తుంది.

ఇది ఏదో ఒక సంస్థానానికిగాని లేక సంస్థానాలన్నిటికి మాత్రమే గాని సంబంధించిన సమస్య కాదు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, అఖిల భారత కాంగ్రెసుకు జరుగుతూన్న పోరాటము. ఇది మన సోదరీ సోదరులు ప్రజా స్వామ్య హక్కుల కొరకు సాగించుతున్న ఉద్యమం. మన శత్రువుచేతనే బహిరంగముగా అణచివేయబడుతోంది. గాంధిజీ, సర్దార్, బజాజ్‌ల గౌరవ ప్రతిష్ఠలు అపాయ స్థితిలో నున్న సమయమిది. కాంగ్రెసు మంత్రి పదవుల జీవితం వూగులాడుతున్న సమయం. దీనిని నిర్లక్ష్యం చేయడం గుడ్డితనమే అవుతుంది.

జమ్నాలాల్ బజాజ్

తటస్థ విధానం నశించింది. సంస్థానాలలో కలుగజేసుకుంటున్న సామ్రాజ్య వాదాన్ని ఓడించడానికి, సంస్థాన ప్రజలకు కాంగ్రెసు సంస్థ బహిరంగంగా సహాయ మొనర్చడమొక్కటే మార్గం. భారత ప్రజల శత్రువును ఎదుర్కోడానికి, ప్రజా సంస్థయైన కాంగ్రెసు నాయకత్వాన, బ్రహ్మాండమైన ఉద్యమం మరల సాగింపబడాలి!

ఈ సందిగ్ధావస్థలో సామ్రాజ్య వాదానిదే పై చేయియై కాంగ్రెసును సంస్థానాల ఉద్యమం నుండి దూరం చేయగలిగినదంటే, ఫెడరేషను వ్యతిరేక యుద్ధములో మనం సగం ఓడిపోయామన్నమాట! ఆ తరువాత సామ్రాజ్య వాదం మన మంత్రులమీద విరుచుకుపడుతుంది. మన మంత్రులను ప్రజలనుండి వేరుచేసి, ఈ మహోద్యమాన్ని అణచివేయడానికి వారిని తమ యంత్రమువలె ఉపయోగించుకోడానికి ప్రయత్నిస్తుంది. దీని పర్యవసానం, మన నెత్తిపై ఫెడరేషనును తెచ్చిపెట్టడమే అవుతుంది. ఒక్కొక్కదానికే లొంగిపోవడం చివరకి మన అపజయానికి దారి తీస్తుంది.

అయితే ఇప్పుడే. లేకపోతే ఇంకెప్పుడూ లేదు. ప్రారంభదశలోనే ఈ సామ్రాజ్యవాదుల దాడిని ఎదిరించి, అణచివేయాలి.

రాష్ట్ర ప్రాథమిక కాంగ్రెసు సంఘాలు తమతమ ప్రాంతాలలో చురుకుగా సంస్థాన ప్రజా వుద్యమానికి సహాయంచేయాలి.

అఖిలభారత కాంగ్రెసుసంస్థ సంస్థానాలన్నింటిలోను సాగుతున్న పోరాటాన్ని సమీకరణ మొనర్చాలి.

సంస్థాన ప్రజాఉద్యమంపట్ల సానుభూతి ప్రదర్శన దేశమంతటాజరగాలి. వలీంటర్లను సహాయనిధిని సంస్థానాలలోనికి ఎక్కువగా పంపాలి.

కాంగ్రెసుమంత్రులు సంస్థానాధీశుల రక్షణ చట్టాన్ని అమలుజరపడానికి నిరాకరించాలి. సంస్థానాలకు పోలీసులను పంపడం మొదలైన సహాయాలేమీ చేయకూడదు. సంస్థానాలలో వలంటీరు క్యాంపులు మొదలైనవి ఏర్పాటు చేసుకోడానికి వీలులేనప్పుడు కాంగ్రెసు రాష్ట్రాలలో వారికట్టి అవకాశాలు మన మంత్రులు కలుగజేయాలి.



# బోస్ సమర సన్నాహము

## కామ్రేడ్ బి. టి. రణదేవ్

సుభాస్‌బోసు త్రిపురీ కాంగ్రెసు మహాసభ ముందు ఒక కార్య ప్రణాళికను ప్రవేశపెట్టబోతున్నాడు. కాంగ్రెసు ప్రస్తుత మవలంబించుచున్న విధానాన్ని చాల మంది విమర్శిస్తున్నారు. కాని విమర్శనకు బదులుగా మనలను కార్యోన్ముఖులనుజేయు ఒక స్పష్టమయిన కార్య క్రమాన్ని సూచించడం మన జాతీయ నాయకులలో ఇదే మొదటి ప్రయత్నం. ఇట్టి ప్రయత్నాన్ని మనం ఆహ్వానించుతాం. అంతేకాదు, కాంస్టిట్యూషన లిజంకు, రాజీకి, దారి తీస్తున్న ప్రస్తుత విధానాన్నుండి తప్పించడానికి చేస్తున్న ప్రయత్నంగాకూడ దీనిని ఆహ్వానిస్తాం. ఈ సూచన, ఒక అతివాది మాత్రమే కాక, అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడైన సుభాస్‌బోసు నుండి రావడమువలన దీనికి మరింత ఎక్కువ ప్రాముఖ్యతను కూడ ఇవ్వాలి.

### ముఖ్య సూచనలు

బోసు కార్య ప్రణాళికలో ముఖ్యమైన సూచనలివి:–

(1) బ్రిటిషు ప్రభుత్వమే ఫెడరేషన్‌లో మార్పులు సూచిస్తుందని కనిపెట్టుకు కూర్చోడము మానివేసి మనమే కార్యోన్ముఖులము కావాలి.

(2) ఇప్పుడు మన దేశానికి అత్యవసరముగా కావలసిన హక్కులను మనమిప్పుడే నిర్ణయించుకొని బ్రిటిషు ప్రభుత్వానికి మన నిశ్చయాన్ని తెలియజేయాలి. మనం కోరవలసినది ఫెడరేషనులో సవరణలు మాత్రమే కాదు. ఎక్కువ అధికారాలు, అంటే, సైన్యముపై అధికారము, సివిల్ సర్వీసుపై అధికారం విదేశ రాజ్యాంగ విధానముపై అధికారము, ఇవన్నీ మన హస్తగతం చేయాలని కోరాలి.

(3) ఇవి నెరవేర్చేటందుకు బ్రిటిషు ప్రభుత్వానికి కొంత గడువును నిర్ణయించాలి. ఆ గడువులో నెరవేర్చక పోతే సత్యాగ్రహం సాగించవలసి ఉంటుంది. (బ్రిటిషు ప్రభుత్వమిప్పుడు కాంగ్రెసుతో పోరాడటానికి అంత సులభంగా తయారు కాజాలదని ఊహించవచ్చు)

(4) మిగిలిన రాష్ట్రాలలో—ముఖ్యంగా బెంగాల్, సింధు రాష్ట్రాలలో—కూడ మిశ్రమ మంత్రివర్గాలు (Coalition Ministries) ఏర్పాటు చేయడం కూడా ఈ కార్యక్రమంలో ఒక భాగం. దీనివల్ల కనీసము పదిరాష్ట్రాలలో కాంగ్రెసు, రాజకీయ వ్యూహంలో ప్రాముఖ్యమైన స్థానంలో వుంటుంది. ఈ మంత్రిపదవుల వలన పది రాష్ట్రాలలో ప్రభుత్వాన్ని ఎప్పుడు పడితే అప్పుడు స్తంభింపజేయవచ్చు. కాంగ్రెసువారు మంత్రిపదవులలో నుంటూనే బయటి ప్రజా పోరాటాలకు సహాయం చేసే పద్ధతుల నవలంబించాలి. మంత్రులు రాజీనామా నివ్వవలసి వస్తే కడపటి ప్రయత్నముగానే ఆ పని చేస్తారు గాని. రాజీనామాల నివ్వడమే పనిగా పెట్టుకోరు.

(5) ఈ అంతిమ సంఘటనల నెదుర్కోడానికి సంసిద్ధులము కావాలంటే, కాన్‌స్టిట్యూషనలిజంలోకి జారిపోకుండా చూచుకోవాలి. స్వాతంత్ర్య యుద్ధానికి కావలసిన స్వభావాన్ని, ఇంతకంటె చురుకైన స్వభావాన్ని అలవర్చుకోవాలి. బోసు సూచించే కార్య విధానము ఎంతసేపూ మొట్టమొదటి సూచన మీదనే ఏర్పరుపబడి ఉంది.

### మితవాదులకు వ్యతిరేకం

ఎవరెన్నిచెప్పినా, ఈనాడు కాంగ్రెసు నాయకులలో ఎక్కువగా వ్యాపించి యున్న అభిప్రాయం అదే. ఈ విధానం, ఫెడరేషనులో సంస్కరణలు కావాలనే వైపుకే దారి తీస్తుంది. కాని కాంగ్రెసు బలాన్ని ఎక్కువ చేసుకోవాలని గాని, కార్మిక, కర్షక, సంస్థాన ప్రజా ఉద్యమాల వైపుకు గాని దృష్టిని ప్రసరించనివ్వదు. ఈ ఉద్యమాల బలాన్ని కాంగ్రెసు క్రోడీకరించిననాడు మన హక్కులు తప్పనిసరిగా ఇచ్చి తీరాలి. మన దురదృష్టవశాత్తు మన కాంగ్రెసు మితవాద నాయకులు ఈ ఉద్యమాలను నిర్లక్ష్యము చేసి, సంపూర్ణాధికారమును కోరవలసిన సమయంలో స్వల్ప సవరణలతో సంతృప్తిపడేలాగున్నారు. ఇది అపాయకమైన విధానము. బ్రిటిష్ ప్రభుత్వంతో మనకి యేదయినా రాజీ కావాలంటే, ఫెడరేషను విషయమై కాదు. అధికారాన్ని మన హస్తగతం చేసే స్పష్టమైన విధానము పైననే అట్టి రాజీ సంభవమౌతుంది. దేశం తగినంత బలముగానే ఉంది. మన మిప్పుడు సామ్రాజ్యవాదముపై సులభంగా దాడిని సాగించవచ్చును. దీనికోసం సామ్రాజ్యవాదులు ఫెడరల్ విధానాన్ని అమలు జరుపడానికి నిశ్చయించుకునేవరకు కనిపెట్టుకుని వుండనక్కరలేదు. మన శక్తుల నన్నింటిని సమీకరణ మొనర్చుకోవలసిన సమయం ఇదే. వాటితో. ఇప్పు డున్న కేంద్ర ప్రభుత్వాన్ని రద్దుచేసి దాని స్థానే ప్రజా ప్రతినిధి పరిషత్తు కావాలని కోరవలసిన సమయం కూడా ఇదే! ఇట్టి సమయంలో బోసు తన కార్యక్రమాన్ని ప్రవేశ పెడుతున్నాడు. ఈ కారక్రమం మితవాదు లవలంబించుచున్న విధానానికి పూర్తిగా వ్యతిరేకమే. కాని చాల అవసరము.

### శత్రువు బలహీనత

నూతన రాజ్యాంగ విధానము అమలు జరిపినప్పటి నుంచీ, సామ్రాజ్య వాదులు ఎల్లా పడితే అల్లా ఆడేటందుకు కొంత అవకాశము ఇస్తూ వస్తోంది కాంగ్రెసు. కాంగ్రెసుయొక్క ఈ బలహీనత మ్యూనిక్ ప్రతిష్టంభన మప్పుడు బాగా బైట పడింది. ప్రపంచ యుద్ధము వస్తుందని అన్ని దేశాలు ఆయత్త పడుతూంటే, అప్పుడే ఢిల్లీలో సమావేశమైన మన కాంగ్రెసు వర్కింగు కమిటీ, యుద్ధంవస్తే భారత దేశంలో ఫలానా కార్య విధానాన్ని అవలంబిస్తామనియైన చెప్పలేక చేతులు ముడుచుకుని, పరిస్థితులు ఎట్లు విషయమిస్తాయో చూచిన తరువాతనే మన కార్య క్రమాన్ని నిర్ణయించవచ్చుననే తన అశక్తతను వెల్లడించింది. ఇది గ్రహించడముచేతనే బ్రిటిషు ప్రభుత్వము భారత దేశములో తానేమి పోరాటాన్ని ఎదుర్కోనక్కరలెకుండానే చల్ల చల్లగా తన పని తాను సాగించుకోవచ్చుననుకుంది. కాంగ్రెసుతో బేరం కుదిరిన తరువాత గాని, లేదా తనకు తగినంత బలము చేకూరిన తరువాత గాని ఫెడరేషనును అమలు జరుపవచ్చునని, కొంత కాలము వరకు దానిని ఆపి వుంచింది. ఏమైనప్పటికి మన కాంగ్రెసు మితవాదులలాగే బ్రిటిషు ప్రభుత్వము కూడా పోరాటానికి సంసిద్ధముగా లేకపోయింది. సరిగ్గా సామ్రాజ్యవాదుల ఈ బలహీనతను ఆధారముగా చేసుకునే బోసు కార్య విధానం ఏర్పరుపబడింది, అందుచేతనే మన దేశానికి కావలసిన అత్యవసర హక్కులివి, అని నిర్ణయించుకుని అవి నెరవేర్చడానికి కొంత గడువును ఏర్పరచినట్లయితే బ్రిటిషు సామ్రాజ్య వాదాన్ని సంధిగ్ధావస్థలో పెట్టిన వాళ్ళ మవుతాము. అప్పుడు సామ్రాజ్య వాదము భారత ప్రజాభిప్రాయానికి లొంగియైనా రావాలి; లేకపోతే వారితో యుద్ధము అయినా చేయాలి. అప్పుడు ముందంజ వేయడానికి అవకాశము మనకే వుంటుంది. రాజకీయ రంగములో బలహీన స్థానంలో వున్న మన శత్రువు మీదికి దాడి సాగించడానికి కావలసిన అనుకూల స్థానములో మనం వుంటాం. ఇప్పటి అంతర్జాతీయ పరిస్థితులనుండి మనం నేర్చుకోవలసిన పాఠము ఏదైనా ఉంటే ఇదే. శత్రువు బలహీనముగా వున్నప్పుడే దెబ్బ కొట్టాలి. లేదా చారిత్రికముగా ఒక మహోత్కృష్టమైన తరుణాన్ని చేతులారా పోగొట్టుకుంటున్నామన్న మాట. ఇప్పుడు మనమెంత గట్టి దెబ్బ కొట్టగలిగితే అంత సులువుగా జయము పొందుతాం. ఇది మన స్వాతంత్ర్య పోరాటములో అవశ్య కర్తవ్యం. యీ మాత్రపు రాజనీతిని అవలంబించలేమా? 1914 లోని పరిస్థితులు మరల ఏర్పడే సూచనలు కనబడుతున్నాయి. ఇటువంటప్పుడే మనం ఒక్కొక్క వ్యవహారమే పరిష్కరించుకుంటూ రావాలి. లేకపోతే నలుగురి దృష్టిలోను నగుబాటు కలిగించే ఏదో ఒక చిన్న రాజీకి తల నొగ్గవలసి వస్తుంది. బోసు కార్య విధానం అంగీకరించామా, సామ్రాజ్య వాదము బలహీనముగా వున్నప్పుడే, కోలుకోలేనంత దెబ్బ కొట్టగలుగుతాం. లేదా లోబడి పోవడమే!

రచయిత

### ప్రజలలో కదలిక

మితవాదుల రాజీ పంథాతో గల వ్యత్యాసాన్ని గమనించగలిగితే, బోసు కార్య విధానములో ముఖ్య లక్షణము ప్రజా శక్తులను సమీకరణ మొనర్చడము. స్వాతంత్ర్య సమరానికి సన్నద్ధులు కావాలసిన సమయమిదేయని హెచ్చరించడము. ఇప్పుడు మన కాంగ్రెసు మితవాదుల శక్తి యావత్తూ, వృద్ధిపొందుతూన్న ప్రజా పోరాటాలకు అడ్డకట్టలు వెయ్యడములోనో, వాటిని తమతో సంబంధము లేకుండ వేరు చేయడములోనో వృధా అవుతూ వుంది. దేశములోని పరిస్థితులు పరిపక్వము పొందుతూ వస్తున్నాయి. కాంగ్రెసు నిర్ణయించిన సరిహద్దులల్లోనే పోరాటాలు బయలుదేరుతున్నాయి. (ఉదాహరణ: బీహారులో రైతు సత్యాగ్రహము, బొంబాయిలో జనరల్ స్ట్రియిక్) ఈ ఉద్యమాల నన్నిటిని బలపరచి, మనందరి ఏకైక సాధనమగు సంపూర్ణ

(మిగతా 14 వ పేజీలో)

"బార్సిలోనా పతనంతో యూరప్ యుద్ధ భయం ఎక్కువవుతుంద"ని క్రిందటిసారి వ్రాశాం. ఈవారం వార్తలీవిషయాన్ని బలపరుస్తున్నాయి.

## స్పెయిన్ విషమావస్థ

బార్సిలోనా పతనం ఒక్క స్పానిష్ ప్రజల అపజయం కాదు. అది ప్రజాస్వామ్య ప్రభుత్వాల అపజయం. ముఖ్యంగా ఫ్రాన్సు బ్రిటనుల గౌరవానికి భంగం. బార్సిలోనాను గెల్చినది ఫ్రాంకోగాదు. ఇటాలియన్ సైన్యాలు. ఒక ప్రక్క ఇటలీ, జర్మనీల సహాయంతో ఫ్రాంకో విజయయాత్రలు సాగించుతోంటే. బ్రిటన్ మారాడటంలేదు. ఫ్రాన్సు సహాయం చేయదలచుకొన్నా బ్రిటన్ అడ్డు పడుతుంది. స్పెయిన్ ప్రభుత్వ వినాశానికి కారణం ఎవరా యనే కళంకం బ్రిటన్ దేనని భావి చరిత్రకారులు వ్రాయకపోరు.

అమానుషమైన తటస్థవిధానం మానమని, ఎన్నోసార్లు విజ్ఞప్తులు, ఊరేగింపులుసాగాయి. లండన్‌లో 12 వేలమంది స్పెయిన్‌కు ఆయుధాలు పంపాల్సిందని ఊరేగింపు చేశారు. కాని ఛాంబర్లేను డిక్టేటర్లను సంతృప్తి పరిచే పద్ధతి మానలేదు.

స్పెయిన్‌లో ఇటలీ కలుగజేసుకొంటున్న విధానాన్ని తెల్పుతూ, మేజర్ అట్లీ ప్రశ్నించితే ఛాంబర్లేను చెప్పినసమాధానం విచిత్రంగాఉంది. "చాలామంది బార్సిలోనా పతనంతో దారుణ హత్యాకాండ జరుగుతుందని తలచారు. కాని అట్లాంటిదేమీ జరగలేదు." హత్యాకాండ జరగలేదనేగాని ప్రజాస్వామిక ప్రభుత్వం న్యాయాన్ని ధిక్కరించి ఇటలీ కలుగజేసుకోవడంవల్ల నశించిపోతుందనే ఆదుర్దా ఛాంబర్లేనుకు లేదు. పైగా స్పెయిన్ ప్రభుత్వానికి సహాయం జేయడం శాంతికి భంగకరమట: అంటే స్పెయిన్ పతనంతో సంభవించే శాంతికే ఛాంబర్లేను ఎదురు చూస్తున్నది. ఛాంబర్లేను ఈవిధానాన్ని పార్లమెంటులో సర్. ఆర్చిబాల్డ్ సింక్లెయిర్, ఆర్థర్ గ్రీన్ వుడ్‌లు ఎదుర్కొన్నారు. "ఇంతవరకు ఫ్రాంకో 130 బ్రిటిష్ నౌకలను ముంచివేశాడని"కూడ తెలియజేశారు.

అయినా ఛాంబర్లేనుకు—అతని ఉపన్యాసాలకు వ్యాఖ్యలుచేస్తున్న హాలిఫాక్సు ప్రభువుకు-డిక్టేటర్లను సంతోష పెట్టడంలోనే "శాంతి" కన్పించుతున్నది. ముస్సోలినీ, సిమానోలు ఇచ్చిన వాగ్దానాలతోనే సంతృప్తి పడుతున్నారు. స్పెయిన్‌లో విద్రోహుల విజయంతో ఇటలీ ఆగుతుందట. ఇదే బ్రిటన్ ఆశ.

స్పానిష్ ప్రజలు వేలకొలది తలదాచుకొందామని ఫ్రాంసు వరుగెత్తుక వస్తున్నారు. వీరి దుస్థితి జూచి ఛాంబర్లేను పార్లమెంటులో మొసలి కన్నీళ్ళు విడవసాగాడు: పాపం ఎంత దయార్ద్ర హృదయుడు: స్పెయిన్ నాశనము అయితే అయిందిగాక—శాంత ప్రియుడు ఛాంబర్లేను!

రోజురోజూ విద్రోహుల విజయవార్తలు వస్తున్నాయి.

జెరోనా రాష్ట్రంలో విజయం కల్గింది. వర్షం వలన కొంత ఇబ్బందికల్గినా విద్రోహులు ముందుకు పోతున్నారు. ఉత్తర కాటలోనియా, మధ్య కేటలోనియాలో ఆక్రమణ సాగింది. సీ ఇరాక్వెల్డు, బెగ్గా, విద్రోహుల వశమయినవి. బెగ్గా ఫ్రెంచి సరిహద్దులకు 25 మైళ్ళలోవుంది. తర్వాత సిమోడి అర్జెల్‌కూడ పతనమయింది.

దక్షిణ జెరోనా రాష్ట్రంలో అనేక గ్రామాలు, విచ్ అనే పట్టణం వశమయినవి. విచ్ వద్ద 2100 మంది ప్రభుత్వ సైనికులు పట్టుబడ్డారు. ఫ్రెంచి సరిహద్దు ప్యూఇన్ సెర్డాకు 19 మైళ్ళ విద్రోహులు వచ్చారు. అండోర్రా, బేర్‌గ్మా దమాల మధ్య 30 వేల ప్రభుత్వ సైనికులు విడివడిపోయారు.

కాటలోనియా యొక్క అన్ని రంగాలలోను విద్రోహులు గెల్చారు. పైరినీస్ గుండా రహదారీలన్నీ ఆక్రమించారు. సరిహద్దుకు 18 మైళ్ళలోఉన్న సిమోడి అర్జెల్‌కూడ విద్రోహుల చేజిక్కింది.

స్పానిష్ మంత్రులు అజానా నెగ్రిన్‌లు పారిస్ వెళ్ళారు.

రోజురోజు ఆర్తుల సంఖ్య హెచ్చింది. ఫ్రెంచి సరిహద్దులలోకి వేలకొలది వచ్చి పడుతున్నారు. ఈ పదిరోజులలో 1 లక్ష మంది ఫ్రాంసుకు వచ్చారు.

ఫ్రెంచి, స్పానిష్ ప్రభుత్వసభ ఒకటి జరిగింది లెపర్తస్‌వద్ద. సామాన్య ప్రజలు సరిహద్దులో ఖాళీఅయాక, ఆయుధాలను లాక్కొని, ఆర్జిలెస్‌వద్ద కాన్‌సెంట్రేషన్ క్యాంప్‌కు సైనికులను పంపడానికి నిశ్చయించారు.

ఈసమస్యను పరిష్కరించలేక త్వరత్వరగా సరిహద్దులకు రావలసిందని ఫ్రాంకోను ప్రార్థించింది ఫ్రాంసు.

తటస్థ విధానం అనే తడిగుడ్డతో స్పెయిన్ గొంతుక కోయబడింది. వలంటీర్ల సమస్య వచ్చినపుడు, స్పెయిన్ ప్రభుత్వం తమ విదేశ వలంటీర్ల నందరినీ పంపి వేసింది. ఫ్రాంసు తన వైరినీస్ సరిహద్దును ఆయుధాలు పోకుండా మూసింది. కాని ఇటాలియన్ సైన్యాలు వెనుదిరగ లేదు.

పైగా నిన్న మొన్న, ఇటాలియన్ ఫేసిస్టు గ్రాండ్ కౌన్సిల్ విచిత్ర ప్రకటనలు గావించింది. పూర్తిగా ఫ్రాంకో జయించే వరకు ఇటలీ సైన్యాలు తిరిగి రావని, ప్రకటించింది. ఇంతేగాదు. కమ్యూనిస్టు సైన్యాలు పూర్తిగా స్పెయిన్ సరిహద్దు దేశాలనుండి పూర్తిగా తరిమితేగాని, ఫ్రాంకో విజయం పూర్తి అయినట్లు లెక్కకాదట: అంటే దీనిఅర్థం ఫ్రాంసులో కూడ తలదాచుకోనీయ వలదని బెదిరింపు.

స్పెయిన్‌లో తమకు భాగం అక్కరలేదని ఇటలీ బ్రిటన్‌కు హామీ ఇచ్చినా అది బూటకమే స్పెయిన్ నంతను కీలుబొమ్మ చేసుకోవాలని, ఇటలీ జర్మనుల అకాంక్ష. ఫ్రాంకో చేతిలో 20 లక్షలమంది రిపబ్లికులలిస్టులుంది. యుద్ధం పూర్తిగానేవారిని మాపుమాప సిద్ధంగా ఉన్నాడు. అతడు కూడ కమ్యూనిస్టు వ్యతిరేకపు ఒడంబడిలో చేరతాడని వేరే చెప్పనక్కర లేదు.

ఈమధ్య నెగ్రిన్ ప్రకటించిన షరతులు చూడండి. ఎంత ఉదారంగా ఉన్నాయో.

1. స్పెయిన్‌కు స్వాతంత్ర్యం
2. స్పానిష్ ప్రజలే తమకెలాంటి రాజ్యం కావాలో కోరుకోవాలి.
3. యుద్ధానంతరం ప్రత్యపకారం ఉండరాదు.

ఇంతేగాదు. ఇదివరకే మత పూజలకుకూడ అనుమతించాడు. ఇదీ ఫ్రాంకో నెగ్రిన్‌లకు భేదం. బోల్షివిజంనుండి రక్షిస్తున్నాననే నెపంతో ఫ్రాంకో ఇటలీకి కీలుబొమ్మ అయి ఫాసిస్టు విజృంభణకు కారకుడయాడు. స్పెయిన్ పతనంతో ఫ్రాంసు, బ్రిటనులకు ముప్పు తప్పదు. ఇటలీ ప్రోత్సాహమే గాక, అల్ఫోంజో (స్పెయిన్ పూర్వపురాజు)కూడ ఫ్రాంకోనుఅభినందించాడు.

# జర్మనీ, కాలనీలకు ఎసరు పెట్టింది!

వలన్సియాపై బాంబులేగాక, స్పెయిన్‌ప్రభుత్వం జినీవాలో దాయటానికి తీసుకపోతున్న ఆర్ట్ ట్రెజరరీ (కళా సంపత్తి) పై బాంబులు విసిరారు. కాని సురక్షితంగాచేరాయి. విద్రోహ ప్రభుత్వ ప్రదేశం చూడడానికి ఒక "అబ్జర్వర్"ను పంపడానికి ఫ్రాంసు నిశ్చయించింది. పూర్వపు మంత్రి బెరార్డ్‌ను పంప నిశ్చయించింది. బార్సిలోనా పతనానికి ముందే బోనెట్ ఇలా పంపడానికి నిశ్చయించాడుగాని వ్యతిరేకతవలన మానాడు. ఇది ముమ్మందు, స్పెయిన్ విద్రోహ ప్రభుత్వాన్ని గుర్తించడానికి ఒకమెట్టు. బ్రిటన్ ఫ్రాంసుల ఈ లొంగుబాటు, లాయడ్ జార్జి చెప్పినట్లు, డిక్టేటర్లకు ఫ్రాంసు, బ్రిటన్లపై పైచేయి నిస్తుంది.

## జర్మనీ : కాలనీలు

హిట్లర్ పరిపాలనకువచ్చి ఆరేండ్లయింది. నాజీ రాజ్యపు ఆరవ వార్షికోత్సవదినాన హిట్లర్ ఒక ఉపన్యాసం గావించాడు. హిట్లర్ అంటేనే ప్రపంచానికి ఒక క్లిష్టసమస్య. అతడెప్పుడు ఏవిధంగా యుద్ధానికి దిగుతాడో అనే భయం చేత అతని ఉపన్యాసానికి ఎదురుచూస్తూ ఉంటారు. ఈసారి హిట్లర్ ఉపన్యాసం కొంత ఊపిరి పీల్చుకొనేందుకు అవకాశం ఇచ్చినా అతని కోర్కెలు అతను మానలేదు, జెకోస్లోవేకియాను బలి గావించినపుడు, ఇంక నేనేమీ అడగనని చెప్పాడు. కాని, నాల్గు నెలలైనా కాలేదు, కాలనీలసమస్య లేవనెత్తాడు. హిట్లర్ ఉపన్యాసంవల్ల నాల్గు ముఖ్యవిషయాలు తేలుతున్నాయి. (1) జర్మనీకి. ఆస్ట్రియా, జకోస్లోవేకియాలు కలిసినా ఆర్థికస్థితి బాగుపడలేదు. (2) ఇటలీ యుద్ధంలో తగుల్కొంటే, ఇటలీకి జర్మనీ సహాయం చేస్తుంది. (3) జర్మనీకి తన కాలనీలు కావాలి. ఊరికే తిరిగి ఈయడమే గాదు. ఇదివరకు తమ క్రింద ఉంచుకొన్నందుకు కొంత పరిహారం చెల్లించాలి. (4) బోల్షివిజం అనే వంకతో ప్రతి ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని బెదరించుతుంది జర్మనీ

హిట్లరుకు యుద్ధం అంటే ఏమిటో తెలుసు. అసలే ఆర్థికంగా బాధపడుతున్న జర్మనీ యుద్ధంవస్తే మరింత బాధలకు లోనవుతుంది. అందుకనే "మ్యూనిక్ సెటిల్మెంటు విధానాన్ని. దలదీర్ ఛాంబర్లేన్‌లనూ అభినందించు"చున్నాడు. జర్మనీ ఆర్థిక స్థితిని గూర్చి చెబుతూ "జర్మనీ ఎపుడూ ఆర్థిక దుస్థితిలోనే ఉన్నది." అని అన్నాడు. ఇక కాలనీల సంగతి "ప్రపంచ యుద్ధానికి పూర్వం, జర్మనీని అపహరిస్తే ప్రజాస్వామ్య రాజ్యాలు బాగుపడతాయని చెప్పాయి కాని.బ్రిటన్‌గాని.బ్రిటిషుప్రజలుగానిబాగుపడలేదు ....మేము కాలనీలను, అక్కడ సైన్యాలు స్థాపించడానికి అడగటంలేదు. మాకు చాలా జనాభా ఉంది. కాని మా ఆర్థిక చిక్కులు తీరటానికి కాలనీలు కావాలి." "మా వస్తువులను ఎగుమతి చేయాలి. మేం ఇతరుల వస్తువుల కొనుక్కోవాలంటే. జర్మనీ ప్రజలు వస్తువులను ఎగుమతి అయినా చేయాలి, లేదా చావాలి· కాని జర్మనీ ప్రజలు చావరు." ఇంతటితో ఆగలేదు. మరొక చోట "తగినంత స్థలమూ, అవసరమైన ముడివస్తువులు లేకుండా మా ప్రజల ఆర్థికస్థితి కుదటబడి వుండజాలదు." దీనినిబట్టి ప్రజాసామాన్యం ఎంత దోపిడికి గురిఅయిందో చెప్పవచ్చు. ఈనాడు కాలనీల కాంక్షకూడ నాజీ ఫేసిస్టుల దురాశకే. కాని ఈ దాహానికి అంతెక్కడది.

స్పెయిన్‌పతనంకాగానే ముసోలినీ ఫ్రాంసుపై తన ధ్వజం ఎత్తవచ్చు. అందుకోసమే ముందుగా హిట్లర్ తన సపోర్టునిస్తూ "ఫేసిస్టు ఇటలీ, నేషనల్ సోషలిస్టు జర్మనీ యూరప్ నాగరికతను రక్షిస్తాయనీ" ఇటలీ యుద్ధంలో తగుల్కొంటే తాము సహాయం గావించుతామనీ బహిరంగంగా చెప్పాడు. స్పెయినును బోల్షివిజం నుండి రక్షించడానికే ఫ్రాంకోకు సహాయం చేస్తున్నామని చెప్పాడు. డఫ్‌కూపర్ ఈడెన్లను యుద్ధప్రేరేపకులని నిందించాడు. బోల్షివిజం అనే కేక ఈనాటిదిగాదు. యూదులతో ప్రారంభించి మాస్కోతో వదలుతాడు. ఇదివరకు బీనిస్, ఇపుడు నెగ్రిన్, రూజువెల్టులు, బోల్షివిక్ స్నేహితులని నిందిస్తూనే ఉన్నారు. హిట్లర్ ఉపన్యాసం విన్నాక తమ భూమిని అంగుళంకూడా వదలమని బ్రిటిష్, ఫ్రెంచి ప్రధానులు అట్టహాసం చేస్తున్నారు. కాని. స్పెయిన్ గోరీపైన బ్రిటిష్, ఫ్రెంచి కాలనీల పతనం ప్రారంభమవుతుందని చెప్పవచ్చు.

ఆర్థిక దుస్థితినుండి ప్రజల మనస్సును తప్పించాలంటే, యుద్ధం తప్పదు. అందుకనే యుద్ధ సన్నాహాలు ప్రపంచమంతా సాగినయి. ప్రతిదేశం తాము నాగరికత రక్షించాలనే చెబుతున్నాయి. ఇటలీ 60 వేల సైనికుల్ని తయారు చేస్తున్నది. బ్రిటన్ ఫ్రాంసులు ఆయుధ సామగ్రి ఉత్పత్తిని త్వర త్వరగా పెంచుతున్నాయి. అమెరికా ప్రబల సన్నాహం చేస్తున్నది.

## నేటి ప్రపంచం

## అమెరికా : ఫేసిజం

అమెరికాలో. సెనెట్ మిలటరీ ఎఫైరుల కమిటీ మీటింగు రహస్యంగా జరిపింది. ఈ మీటింగు వృత్తాంతాలు ఫేసిస్టులను కల్లోల పరిచాయి. అమెరికా ప్రజా స్వామ్య దేశాలను సపోర్టు చేస్తుందని, యుద్ధంవస్తే నిషేధం లేకుండ ప్రజా స్వామ్య రాజ్యాలకు ఆయుధాలు సప్లయి చేస్తుందని, అమెరికా సరిహద్దు ఫ్రాంసు అని అన్నారని' ఈ సభావృత్తాంతాలు. రూజువెల్టు తర్వాత ఈ రిపోర్టు అబద్ధమని ప్రకటించాడు. ఈ ప్రకటనకు ముందు ఫేసిస్టు పత్రికలు, రూజువెల్టు శత్రువు నం. 1, అని, యుద్ధప్రేరకుడు, బోల్షివిక్కుల ఛాంపియన్ అనీ, యూదులకోసం ప్రపంచాన్ని మంటగలుపుతాడనీ వ్రాశాయి. సీనర్‌గయాడా (ఇటలీ) ఇలా వ్రాశాడు. "అమెరికా సరిహద్దు ఫ్రాంసుఅయితే ఇటలీ సరిహద్దు పనామా". జర్మనీ పత్రికలు ఇలా వ్రాశాయి.

"మా సరిహద్దు నిర్ణయింపబడే వుంది. ఇతరులెవరూ మా హద్దులోకి రాలేరు. ఇంగ్లీషువారు, అమెరికన్‌లు, వారి సరిహద్దులను మార్చుకుంటూ ఉండనీయండి."

రూజువెల్టు ఇదివరకు ప్రకటించబడ్డ వార్తలబద్ధమనీ, ప్రకటించాడు. కాని ఫేసిస్టు పత్రికలు సంతృప్తి పడలేదు. తీవ్రంగా దూషింపసాగినాయి. ఇటలీలోని అమెరికన్ రాయబారి ఒక ఉత్తరం బంపాడు ఈవిషయాన్ని తెలియజేస్తూ.

రూజువెల్టు అబద్ధమని ప్రకటించినా, నమ్మకుండా ఉండటానికి కారణం లేకపోలేదు. మొదటినుండీ అమెరికా ఫాసిస్టు వ్యతిరేక దృక్పథం ధైర్యంగా తీసుకొంటున్నది.

రూజువెల్టు

జపానుకు తీవ్రంగా అసమ్మతులు తెలియజేయడం, బెర్లిన్‌నుండి అమెరికన్ రాయబారిని రప్పించడం, నాజీలను తిట్టిన ఇక్స్‌ను సపోర్టు చేయడం, లిమావద్ద ఫేసిస్టు వ్యతిరేక ప్రతిఘటనకై, కార్డెల్‌హల్ ఒక సభను సమావేశం గావించడం, ఆయుధ సంపత్తిని వృద్ధి చేయాలని రూజువెల్టు కాంగ్రెసుకు సందేశ మంపడం—ఇదీ గతచరిత్ర. ఇలా అమెరికా ఉండటానికి కారణం, జపాన్, జర్మనీలతో ఆర్థిక ఘర్షణయే.

## తూర్పు యూరప్ స్థితిగతులు

హంగేరీ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘానికి వ్యతిరేకంగా సంధిచేసుకొన్న జపాన్-జర్మనీ-ఇటలీలతో కలిసింది. అందువల్ల రష్యా హంగేరీతో సంబంధ బాంధవ్యాలు తెంచుకొన్నది. హంగేరీలోని సోవియట్ కార్యాలయం మూసివేయబడుతుంది. మాస్కోలోని హంగేరీ కార్యాలయంకూడ అలాగే మూసివేయబడుతుంది.

ఈ కమ్యూనిస్టు వ్యతిరేకసంఘ చరిత్ర చూద్దాం. 1936 నవంబరులో జర్మనీ-జపానులు సంధిచేసుకున్నాయి. కమ్యూనిజం నుండి పరస్పరం రక్షించుకోవడమట వీరి ఉద్దేశ్యం. పోలండుకు కూడ ఆహ్వానం వచ్చింది. కాని అది నిరాకరించింది. తర్వాత ఒక సంవత్సరానికి ఇటలీ చేరింది. ఈ సంధి ఫలితంగానే స్పెయిన్‌లో ఇటలీ - జర్మనీలు (బోల్షివిజం)తో యుద్ధం చేయ సాగాయి. 1937 జపాను చైనాతో "బోల్షివిజం"తో యుద్ధం చేయసాగింది.

ఈసంధివల్ల ఒకటి తేలుతుంది. ముమ్మందు రుమేనియా, యుగొస్లోవియాలపైన హంగేరీ ఒత్తిడి తేవచ్చు. రుమేనియాపై "డోబ్రుజా" కావాలని ఆందోళన చేస్తున్న బల్గేరియాను బాల్కన్ ఎంటెంటీ (రుమేనియా, యుగొస్లోవియా, హంగేరీ) చేర్చుకొని సంతృప్తి పరచాలని చూస్తున్నారు: బాల్కన్ రాష్ట్రాలపై హిట్లర్ ఒత్తిడి ఎక్కువ కాజొచ్చింది. రుమేనియా విదేశాంగమంత్రి హిట్లర్ పాలసీని మెచ్చుకుంటున్నాడు. పోలండ్ ఇదివరకే జర్మనీతో సంప్రదింపులు సాగించుతున్నది. జకోస్లోవేకియాలోకూడ కమ్యూనిస్టు వ్యతిరేకపు ఒడంబడికలోచేరాలని స్లోవక్‌పార్టీవారు ప్రచారం చేస్తున్నారు. ఈవిధంగా జకోస్లోవేకియా, హంగేరీ. రుమేనియా, పోలండులను నాజీవశం గావించుకొని యుక్రెయిన్‌పై దెబ్బ గొట్టాలని హిట్లర్ ఆశ.

## జపాను : రష్యా సంఘర్షణ

ఇటు హిట్లర్ యుక్రెయిన్ సమస్య పెద్దది జేసి పశ్చిమభాగాన హిట్లర్ దెబ్బకొట్ట దలచుకొంటే అటు జపాను రష్యాపై బడటానికి సిద్ధంగాఉంది. మంచూకో సరిహద్దులో రష్యన్లపైన జపానువారు తుపాకులు కాల్చారని ఒక వార్త. రష్యన్ సైనికులు నూర్గురు సరిహద్దు దాటడంవల్ల జపాను సైనికులు కాల్చారని మరొకవార్త. ఒక గంట యుద్ధం జరిగిందనీ, రష్యన్లు 5 గురు చనిపోయారనీ జపానువార్తలు తెల్పుచున్నాయి. జపాను, రష్యాలు, రెండూ ఒకదానిపై యొకటి వేర్వేరు విషయాలపై అసమ్మతిని తెలియజేసినాయి. ఒకవేళ జపాను రష్యాపై దాడివెడలితే ఇదే సమయమని చైనా జపానును తరుమ ప్రయత్నిస్తుంది.

## చైనా : జపాను యుద్ధం

ఈమధ్య జంగ్—కే—షెక్ ఉపన్యసిస్తూ జపాను సైనికులు ఇంతవరకు 70 వేల మంది చనిపోయారని, నూటికి 30 చొప్పున చైనాకు, 70 చొప్పున రష్యాకు తమ సైనిక బలాన్ని ఖర్చు పెట్టదలచికొన్న జపాను, చైనాకే 100కి 60 చొప్పున ఖర్చు పెట్టిందనీ తెలియజేశాడు.

చైనాను ఐక్యపరచుచున్న జపాను విధానం.

చైనా క్యుమిన్‌టాంగ్ పార్టీ సమావేశంలో కమ్యూనిస్టులను పార్టీలో చేర్చుకోవాలన్న సూచన నిరాకరించబడింది. అన్ని దేశాలకు వర్తక వ్యాపారాలు చేసుకొనేందుకు అవకాశమిచ్చే విధానం అంగీకరించ బడింది. చైనా జయించి తీరుతుందని వీరి విశ్వాసం.

క్రొత్తగా నిర్మించిన బర్మా యూనాన్ రోడ్డుతో తమ కాయుధాలకు మోసేందుకు చైనా 1300 లారీలను కొంది బ్రిటన్ 50 వేల పౌనులను అప్పు ఇచ్చింది.

## సామ్రాజ్యవిచ్ఛిన్నమా

ఐరిష్ రిపబ్లికన్ పార్టీరహస్యంగా పనిచేస్తూ బ్రిటన్‌లో బాంబులతో హడలెత్తించుచున్నది పాలస్టయిన్ రౌండు టేబిల్ కాన్ఫరెన్సు ఒకప్రక్కజరుగుతున్నా యుద్ధం జరుగుతున్నది. పాలస్టయిన్సభ విఫలం అవుతుందనికూడ ఒక

ఛాంబర్లేన్

వార్త. ఇండియాలో 6 నెలలలో స్వరాజ్యం కావాలంటూ రాజకీయ సభలు.తీర్మానించాయి. బ్రిటిష్ సామ్రాజ్యానికి నేడున్న విషమావస్థను వినియోగించుకొని. బోసు కార్యక్రమానికి జాతిఅంతా ఐక్యంగాతోడ్పడితే మనకు త్వరలోనే స్వరాజ్యం సంప్రాప్తం గావచ్చు.

## బోస్ సమరసన్నాహం

(11 వ పేజీ తరువాయి)

స్వాతంత్ర్య పోరాటానికి ఉపయోగించుకోడానికి బదులు మన మితవాద నాయకులు వాటిని చెదరగొట్టి, కాంగ్రెసును వాటినుండి దూరము చేస్తున్నారు. ఇట్టి విషాదకరమైన విధానాన్ని వదలిపెట్టి, ఆఉద్యమాలపై కాంగ్రెస్ ప్రయోగించుతూన్న నిషేధాలను విరమించుకొనకపోతే, దేశములో ఐక్యతా వుండదు, కాంగ్రెసుకు శక్తీ వుండదు, దేశానికి విముక్తీ వుండదు. ఇవన్నీ సమకూడాలంటే, కాంగ్రెసు ప్రజాశక్తుల ఐక్యతతో బ్రిటిషు ప్రభుత్వముతో పోరాటానికి సాగి రావాలి. బోసు నినాదము కాంగ్రెసుకు ఈ చలనశక్తి నిస్తుంది. అంతేకాదు. బ్రిటిష్ ప్రభుత్వానికి మన తుది నిశ్చయాన్ని తెలియపరచి మన కోర్కెలు నెరవేర్చడానికి కొంత గడువు నిర్ణయించడము, దేశములో వేలకొలది ప్రజలకు అమితోత్సాహాన్నిచ్చి వాతావరణాన్ని పూర్తిగా మార్చివేస్తుంది. అప్పుడు ప్రజాసామాన్యం, ప్రజాపోరాటమే మన ప్రధాన ఆయుధమనీ, మంత్రిపదవులు దానికి సాయపడేవి మాత్రమే అని గ్రహించుతుంది. క్లుప్తముగా చెప్పాలంటే బోసు కార్య విధానము, దేశములో ప్రస్తుతము వున్న స్థితిగతుల నన్నిటిని మార్చివేసి ప్రజాసామాన్యములో చలనము కలిగిస్తుంది.

### మిశ్రమ మంత్రి వర్గాలు

మిశ్రమ మంత్రివర్గాల నేర్పరచడము కార్యక్రమములో ఒక భాగమేనని చెప్పాము. బెంగాలు, సింధు రాష్ట్రాలలో మిశ్రమ మంత్రివర్గాలు ఏర్పడితే నిస్సందేహముగా దేశములోని రాజకీయ వాతావరణము మారుతుంది. కుల, మత తత్వాల నాధారముగా చేసుకొని అనర్థాలను తెచ్చిపెట్టు తుంటరులను అణచివేయ గలుగాము. అంతకంటె ముఖ్యమైనది, పది రాష్ట్రాలలో పార్లమెంటరీ ప్రతిష్టంభనాయుధముతో బ్రిటిషు ప్రభుత్వాన్ని ఎదుర్కొనగలిగిన స్థితిలో వుంటాము. ఈ కార్యక్రమములో మంత్రిపదవులు అంతటి ప్రాముఖ్యతను వహిస్తాయి కనుక వారు, ప్రజాందోళనకు బల్లెపు మొనలవలె పని చేయుటకు తగిన విధానాన్ని నిబంధనలను మంత్రులకు నిశ్చయించాలి. కాంగ్రెసు కార్యక్రమాన్ని ఎన్నికల ప్రణాళికను అమలు జరపడములో మన మంత్రులు ఇంతకంటె ఎక్కువ ధైర్యమయిన విధానాన్ని, అవలంబించకపోతే అభివృద్ధిదాయకమైన పాత్ర వహించలేరు. ముఖ్యముగా మిశ్రమ మంత్రి వర్గాలలో ఇది కావాలి. కాంగ్రెసు కార్యక్రమానికి హానికరమైన మార్గాలను పోయే గ్రూపులతోను, పార్టీలతోను మనము కలసి మిశ్రమ మంత్రివర్గాలు ఏర్పరచకూడదు. మన ముఖ్య సూత్రము మంత్రిపదవుల నిలకడగా వుండేటట్లు చేయడము కాదు. వాటి ద్వారా కూడ ప్రజాపోరాటాన్ని ఎక్కువ పెంపొందింప జేయడము మాత్రమే.

బెంగాలులో నళినీరంజన సర్కారు మొదలయిన వారితో కలసి మిశ్రమ మంత్రివర్గాన్ని ఏర్పరచాలనే మన మితవాదుల ప్రయత్నం చాల ప్రమాదకరమయిన ఫలితాలతో నిండి వుంది. అందుచే అతివాదుల మందరము అట్టి మిశ్రమ మంత్రి వర్గాలను ఏర్పాటు చేసేటప్పుడు ఇంతకంటె తీవ్రమైన విధానాన్ని అనుసరించమని మన నాయకులను హెచ్చరించాలి. మిశ్రమ మంత్రి వర్గాలలో కాంగ్రెసు కోరవలసినవి, పౌరసత్వ హక్కులను ఎక్కువ చేయాలని, ప్రజల ఆర్థిక స్థితిని బాగుచేయాలని, కాంగ్రెసుయొక్క కార్మిక కర్షక కార్యక్రమాన్ని అమలు జరపాలన్న, ఈ మాత్రపు రక్షణలు వుండకపోతే, మిశ్రమ మంత్రి వర్గాలనుకూడ రాజకీయ రంగములో ఒక ఆయుధముగా వుపయోగించు కుంటామనడము అర్థములేని మాట.

### ఒక లోపం

బోసు సూచించిన కార్య ప్రణాళికలో ఒక లోపరమాత్రము ఉంది. సంస్థాన ప్రజా పోరాటాన్ని గురించి అందులో ఏమీ లేదు. సంస్థాన ప్రజా ఉద్యమాన్ని మన ఉద్యమముతో ఐక్యత పర్చాలి. యీ ఐక్యత మన భవిషత్ పోరాటములో ఎక్కువ ప్రాముఖ్యత వహించి తీరుతుంది. అతివాదులంతా ఈ ఐక్యతను ఏర్పరచాలని కోరాలి. మన దేశానికిప్పుడు కావాలని మనము నిర్ణయించబోయే హక్కులనుండి సంస్థాన ప్రజలను వేరుచేయకూడదని చెప్పాలి. మనము కోరే హక్కు సంస్థానేతర ప్రజలకే కాక యావద్భారత ప్రజా సామాన్యానికీ కావలసినదిగా వుండాలి.

బోసు కార్య క్రమం, కాంగ్రెసుకు ఇతర ప్రజా సంస్థలకు కావలసిన ఐక్యతను గురించి కూడ ఏమీ సూచించడంలేదు. ఇక్కడకూడ ప్రజా సంఘాలన్నీ కాంగ్రెసును బలపరచాలని హెచ్చరించాలి. కాంగ్రెసుతో పాటు స్వాతంత్ర్య సమరం సాగించడానికి అవికూడ సిద్ధంగా వుండాలని చెప్పాలి. జాతీయ పోరాటంలో వారి వారి ఆర్థిక హక్కుల పోరాటంకూడ ఒకభాగమేనని చెప్పాలి. బోసు కార్య క్రమం, కొంత రాజకీయ చైతన్యం గలిగిన కాంగ్రెసువారికి మాత్రమే చెవి సోకుతుంది. ఇప్పుడు మన అతివాదులందరి కర్తవ్యం, ఆ కార్య క్రమాన్ని ప్రజా సామాన్యం వరకు తీసికొని పోయేటట్లు చూడడం. ప్రజలలో అది నాటుకునేటట్లు చేయడం.

### విప్లవకరమైన మార్పు

ఈ లోపాలన్నీ ఉన్నప్పటికీ బోసు కార్య విధానం ముఖ్యంగా బూజుకట్టిన ప్రస్తుత పద్ధతులకు స్వస్తి చెబుతుంది. ఫెడరేషన్‌ను ఎదిరిస్తాం ఎదిరిస్తామని చెప్పే గాలి కబుర్లకు బదులు ఎదిరించడానికి ఏమి చెయ్యాలో తెలియపరుస్తుంది. దేశానికి కావలసిన స్పష్టమైన హక్కులపై మన సామాన్యపు దృష్టిని కేంద్రీకరింప జేస్తుంది. శత్రువును సవాల్ చేయడానికి మంచి అనుకూలమైన సమయాన్ని చూపుతోంది. బ్రిటిషు ప్రభుత్వానికి కొంత గడువును నిర్ణయించడము వల్ల మనము తక్షణం చేరవలసిన ఆశయాన్ని దేశము ముందు పెడుతోంది. వాటన్నిటికంటె ముఖ్యమైనది మనం సరిగ్గా స్వాతంత్ర్య పోరాటానికి సంసిద్ధము కావలసిన సమయంలో దానికి తగిన వాతావరణాన్ని ఏర్పరుస్తుంది. కాంగ్రెసు కంతటికీ చురుకుదనాన్ని కలుగజేస్తుంది. ప్రజా శక్తులను గుర్తింప జేస్తుంది. కొన్ని సవరణలతో ఫెడరేషన్ అంగీకరించాలనే మితవాదుల రాజీ ధోరణికి తావులేకుండ చేస్తుంది. మన దృష్టిని తాత్కాలికములయిన మంత్రి పదవుల మీదనే బెట్టుకు కూర్చోకుండా అత్యంత ముఖ్యమైన ప్రజా పోరాటం పైపుకు త్రిప్పుతుంది. ఆ విధముగా బోసు కార్య విధానము రాజకీయాలలోనే ఒక విప్లవకరమైన మార్పును తెస్తోంది. ఒకసారి ప్రజా శక్తులు విడుదల చేయ బడ్డాయంటే, కాంగ్రెసు దానికి అనుమతించిందంటె. పోరాటంయొక్క విధానం, ధోరణి, మన అతివాదుల చాక చాక్యంమీదనే ఆధారపడి ఉంటుంది.

ఫెడరేషను నిరాకరించుతాం, పోరాడుతాం, అని కబుర్లు చెప్పడము మానివేసి అది కార్యాచరణలో చూపాలనే వారంతా బోసు సూచించిన కార్యక్రమాన్ని ఆహ్వానించాలి. రేపటి త్రిపురి కాంగ్రెసులో దానిని పూర్తిగా బలపర్చాలి. మనము తీసుకోవలసిన చర్య ఎటువంటిది. దానినుండి స్వాతంత్ర్య సమరానికి సాగిపోవడము ఎల్లాగ అనే విషయాన్ని గమనించవలసిన బాధ్యత అతివాదులందరిపైన ఉంది. ఇది వూరికే ఫెడరేషనుమీద యుద్ధాన్ని ప్రకటిస్తున్నాం. మా ఆశయము సంపూర్ణ స్వాతంత్ర మే అని కేకలు వేసినంత మాత్రాన పూర్తి కాజాలదు. వెంటనే బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో పోరాటం ప్రారంభించాలి.

### అతివాదుల కర్తవ్యం.

ఇప్పుడున్న కేంద్రప్రభుత్వాన్ని, నూతన ఇండియా చట్టాన్ని నాశనం చేయడానికి ఉద్యమం సాగించాలి. కొన్ని లోపా లున్నప్పటికి ఈ కార్యక్రమం అతివాదులందరికి చక్కని ఆవకాశాన్ని యిస్తుంది. ఇప్పుడే అతివాదు లందరు ఐక్యత సమకూర్చుకోవాలి. కాంగ్రెసులోని అతివాదు లందరూ ఒక అతివాద 'బ్లాక్' గా ఏర్పడాలి. మితవాదులు తెచ్చే విమర్శనలకు సమాధానముగా త్రిపురి కాంగ్రెసులో, అతివాదు లందరూ బోసు కార్యవిధానాన్ని బలపరచి కాంగ్రెసును ఒక్కనిర్ణీతకార్యక్రమాన్ని అవలంబించేటట్లు చేయలేకపోతే తమవిధిని నెరవేర్చలేకపోతా రన్నమాట. త్రిపురిలో సుభాస్‌బోసు కార్యప్రణాళికయే ప్రధాన విషయముగా మారాలి. దీనిని బలపర్చేటప్పుడు మనం పరిష్కరించ వలసిన సమస్యలివి: మన కిప్పుడు కావలసిన కోర్కెలను నిర్ణయించుకోవడమా, ఫెడరేషనునే అంగీకరించడమా? మన హక్కులు మన కివ్వడానికి బ్రిటిషు ప్రభుత్వానికి కొంత గడువు నిచ్చి పోరాటము ప్రకటించడమా, మంచి ముహూర్తము కోసము వ్రేళ్లు లెక్కబెట్టుకుంటూ కూర్చోడమా? ప్రజా శక్తులను క్రోడీకరించడమా, మంత్రిపదవులే మోక్ష సాధనమని జపం చేయడమా? బోసు త్రిపురిలో ప్రతిపాదించే కార్యవిధానం, మనలను కార్యోన్ముఖులను చేసే ఏకైక ప్రణాళిక. ఈ అవకాశాన్ని జారవిడిస్తే మరల ఒక సంవత్సరము వరకు, జాతీయ రాజకీయ విధానాన్ని నిర్ణయించేటందుకు ప్రజాసామాన్యం నోరెత్తడానికి వీలుండదు. ఇది ఒక భారత దేశ చరిత్రలోనే కాదు ప్రపంచ చరిత్రలో కూడ ఎంతో ముఖ్యమైన సంవత్సరము. ఇప్పుడే మనము పోరాటానికి సన్నద్ధులము కావాలి. బోసు కార్య విధానాన్ని త్రోసిపుచ్చామంటే, జాతీయోద్యమ చరిత్రలో ప్రధానమైన స్వాతంత్ర్య సమర కార్యక్రమాన్ని త్రోసిపుచ్చుతున్నా రన్నమాట. త్రిపురీ కాంగ్రెసు ప్రతినిధులీ అపచారానికి ఒడిగట్టరనియే మా విశ్వాసం.

బోసు కార్యప్రణాళికలోని లోపాలను సరిపుచ్చడానికి అతివాదులీ క్రింది సూచనలను కూడ జతపరచాలి.

(1) స్పష్టమైన యుద్ధప్రతికూలాందోళన ఈకార్యక్రమానికి ముఖ్యసూత్రముగా వుండాలి.

(2) కాంగ్రెసు కార్యక్రమాన్ని, ఎన్నికల ప్రణాళికను అమలు జరపడంలో మన మంత్రులింతటికంటె ధైర్యమయిన విధానాన్ని అనుసరించాలి.

(3) సంస్థాన ప్రజా ఉద్యమాన్ని కాంగ్రెసు ఉద్యమంతో జతపర్చాలి.

(4) ప్రజాసంఘాలన్నిటిని (కార్మిక కర్షకసంఘాలు) ఆర్థిక హక్కులకు ప్రాధాన్యత నిస్తూ స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొనవలెనని హెచ్చరించాలి.

(5) గడువుకాలములో దేశమంతటా ప్రజా ప్రదర్శనాలు జరపాలి.

(6) వాలంటీరు దళాన్ని వెంటనే ఏర్పరచి, ప్రచార, ఆందోళనలు సాగించడానికి వారికి తర్ఫీదు నివ్వాలి.



# రాజకోట మళ్లీ రచ్చ కెక్కింది.

రాజకోటలో తిరిగి సత్యాగ్రహం ప్రారంభమైంది. ప్రజా పరిషత్తుపై నిషేధాజ్ఞలు జారీ చేయబడ్డాయి. 21 మంది నాయకులు అరెస్టు చేయబడ్డారు. ప్రజా పరిషత్తుకు ఏవిధముగా సహాయపడినా సరే ప్రభుత్వము వారిని శిక్షిస్తుందని ప్రకటించింది. శ్రీమతి కస్తూరిబాయి గాంధీ, మణీబెన్ పటేల్ గార్లు రాజకోటలో సత్యాగ్రహం చేసి అరెస్టు ఆయారు. రాజకోటలోని పోరాటానికి సహాయం చేయడానికి, దాని తరపున పోరాడడానికి తయారుగా నుండవలసినదని వల్లభాయిగారు గుజరాతు రాష్ట్ర కాంగ్రెసు సంఘంలో ఉపన్యాసం ఇచ్చారు.

రాజకోటలో రాజీ భగ్నంఅయేటందుకు బ్రిటిషుప్రతినిధియేకారకుడనీ, ఆవిధంగా అతను కలుగజేసుకోడం మాన్పించి రాజీని అమలు జరిపించవలసినదనీ, గాంధిజీ వైస్రాయిని కోరాడు. ఇప్పుడు జరిగే పోరాట మంతా సంస్థాన ప్రభువుకీ ప్రజలకీ మధ్య కాదనీ, బ్రిటిషుప్రభుత్వానికీ, కాంగ్రెసుకీ జరిగే పోరాటమే అవుతుందనీ అన్నాడు. గాంధీ గారికి సమాధానం ఇస్తూ రాజకోట ప్రభువు చేసిన దానిలో తప్పేమీ లేదనీ, బ్రిటిషు ప్రతినిధి అక్రమాలు చేస్తున్నట్లు ఆధారా లేమీ లేవనీ ప్రభుత్వం గాంధీజీకి సమాధాన మిచ్చింది. మహాత్మాజీ కూడా రాజకోట నిర్బంధ విధానాన్ని ఎదుర్కోడానికి సత్యాగ్రహం చేయ సమకట్టాడు. (అని ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌విలేఖరి వ్రాశాడు.)

రాజకోటలోని ప్రజా ఉద్యమాన్ని అణచివేయడానికి దివాన్‌గా, సింక్లెయిర్ అను ఆయనను ఏడెన్ నుండి దిగుమతి చేస్తున్నారు. రాజకోట వ్యవహారాన్ని సవ్యముగా పరిష్కరించి, రాజీ షరతులు అమలు జరుపకపోతే బొంబాయి మంత్రివర్గాన్ని వదులుకోవలసి వస్తుందని మహాత్మాజీ ప్రభుత్వమునకు తెలియ జేశారు.

## సత్యాగ్రహానికి కారణం

సర్దార్ వల్లభాయిపటేలుకు, రాజకోజ సంస్థానాధీశునికి మధ్య రాజీ ఇదివరలో జరిగింది. ఆ ఒడంబడిక ప్రకారం రాజకోట సంస్థానంలో రాజకీయ సంస్కరణలను గూర్చి విచారించి జనవరి ఆఖరుకు నివేదికను తయారు చేయడానికి ఒక కమిటీని ఏర్పాటు చేయడానికి అంగీకరించబడినది. ఆ కమిటీలో సర్దార్ వల్లభాయిపటేలుగారిచే సూచించబడిన సభ్యులు 7 గురు ఉండునట్లును, ప్రభుత్వంచేత 3గ్గురు సభ్యులు ఏర్పాటు చేయబడేటట్లును, ఒక అధ్యక్షునికూడ సంస్థాన ప్రభువే నియమించునట్లు అంగీకరించబడింది. ప్రజా పరిషత్తు సత్యాగ్రహాన్ని ఆపివేసేటట్లును, ప్రభుత్వం నిర్బంధ విధానాన్ని ఆపివేసి, రాజకీయ ఖైదీలను విడుదల చేసి వారినుండి వసూలు చేయబడిన జరిమానాలను, ఆస్తులను వారికి ఇచ్చివేసేటట్లును ఒడంబడికలో షరతులు ఏర్పాటు చేయబడ్డాయి.

రాజకోటకు ఇదివరలో దర్బార్ వీరవల్లా దివాన్. రాజా పరిపాలన అంతా ఆయనపై వదలివేసి దాన్ని చూడను కూడా చూచేవాడు కాదు. దివాన్ దుష్పరిపాలన చేసి ఆర్థికముగా రాజకోటను ధ్వంసం చేశాడు. అందుచే ఉద్యమం ప్రారంభమయింది. దీనిని అణచడానికి బ్రిటిషుప్రభుత్వ ప్రతినిధి సహాయంతో సీమనుండి సర్ పాట్రిక్ కాడెల్ అను ఆయనను పిలిపించి రాజకోటకు దివానుగా ఏర్పాటు చేశాడు. ఉద్యమాన్ని అణచడానికి దివాన్ శాయశక్తులా పనిచేశాడు. కాని ఉద్యమానికి ఇతరప్రాంతాలనుండి అఖండమైన సానుభూతి వచ్చింది. రాజకోటలో నుండి వచ్చే వస్తువు లన్నీ బొంబాయి అహమ్మదాబాదులలోని వర్తక సంఘాలు బహిష్కరించాయి. గుజరాత్, బొంబాయిల నుండి సత్యాగ్రహంచేయడానికి వలంటీరుదళాలు వెళ్ళి అరెస్టు అయాయి. ఈ సానుభూతి సహాయం వల్ల రాజకోట ప్రజా ఉద్యమం బలం సంపాదించి పన్నుల నిరాకరణకు కూడా దిగింది. నిర్బంధ విధానం వల్ల ప్రయోజనం లేదని రాజా పటేలుతో రాజీ చేసుకొన్నాడు.

పటేలు - ధాకూర్‌సాహేబ్ ఒడంబడిక ప్రకారము ఏర్పాటు చేయబడే సంస్కరణల కమిటీలో కాంగ్రెసు ప్రతినిధులు మెజార్టీలో ఉండుటను ఏజెంటు నిరసించి దానివల్ల ఇతర సంస్థానాలలో కొంపలంటుకుంటున్నాయని చెప్పి ఆ ఒడంబడికను భగ్నము గావించవలసినదని ధాకూరు సాహెబ్‌పై ఒత్తిడి తెచ్చి రాజీపాడు చేశాడు. అందుచేతనే పోరాటముతిరిగి ప్రారంభమైంది.

# జైపూర్‌లో సత్యాగ్రహం ప్రారంభమైంది.

జయపూర్ సమస్య ఒక అఖిల భారత సమస్యగా పరిణమిస్తుందని మహాత్మజీ ప్రకటన చేశాడు. అఖిల భారత కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యుడు బజాజ్ గారు జయపూర్‌కు వెళ్ళడం, క్షామనివారణ కార్యకలాపంమీద, నిషేధాన్ని ప్రకటించడం అక్రమం. జీవకారుణ్య వ్యవహారాలు నిర్వహించడంకూడా అక్రమమే అయితే, ఇక సహించేదేలాగ!

జయపూర్ సంస్థానములో ప్రజా మండలి 1931 వ సంవత్సరములో ఏర్పడింది. నాటినుండీ ప్రజల సేవ చేస్తోంది. నిర్మాణ కార్యక్రమాన్ని సాగిస్తోంది. 1936 లో దీని విధులు నిబంధనలు మార్పు చేయబడ్డాయి. యీ ప్రజా మండలిలో జయపూర్ సంస్థానములోని పలువురు ప్రముఖులు సభ్యులు. జమ్నాలాల్ బజాజ్ గారు మొదటినుండీ యీ సంస్థకు అధ్యక్షులుగా పని చేస్తున్నారు.

యిటీవల జయపూర్ సంస్థానములో క్షామము ఏర్పడింది. ప్రభుత్వానికి ఇచ్చుకోవలసిన పన్నులు వగయిరాలను ఇచ్చుకోలేక ప్రజలు బాధపడుతున్నారు. జయపూర్‌లోని ప్రజామండలి వారికి ఉచిత రీతిని సేవ చేస్తోంది.

సంస్థాన ప్రభుత్వం మాత్రము ఏ రూపములోనూ ప్రజా మండలికిగాని ప్రజలకుగాని ఏ విధమయిన సదుపాయాలు చేయడంలేదు. పైగా ప్రజా మండలి చేసే సేవకు అడ్డుతగులుతోంది. ప్రజా మండలిపై నిషేధం ప్రకటించి ఆంక్షలు పెట్టింది.

యీ స్థితిలో ప్రజా మండలి పనిని నెరవేర్చడము, ప్రజలకు సదుపాయము కలిగేలాగున చేయవలసిన బాధ్యత, ప్రజా మండలి అధ్యక్షుడు సేట్ జమ్నాలాల్ బజాజ్‌గారిపై బడింది. అందుచే ఆయన జయపూర్‌కు బయలుదేరి వెళ్లుచుండగా ఆయన ప్రయాణంపై ఆంక్ష వేసి సంస్థానములోకి రావద్దని ప్రభుత్వము నిషేధించింది. బజాజ్‌గారు జయపూర్‌కు వెళ్లేటందుకు ఇంకొక కారణంకూడా ఉంది. సికార్ సత్యాగ్రహం బాపతు రాజకీయ ఖైదీలు 10 మంది ఇంకా జైళ్ళల్లోనే మగ్గుతున్నారు. వారిని విడుదల చేయవలసినదని ఇదివరలో బజాజ్‌గారు కోరగా ప్రభుత్వం సమ్మతించింది. కాని అమలు జరుపలేదు. యీ విషయమై సంస్థాన అధికారులతో సంప్రదించి వారిని విడుదల చేయించాలనే ఉద్దేశ్యంకూడా బజాజ్‌గారికి ఉంది.

కాని బజాజ్‌గారి రాకనే ప్రభుత్వం నిషేధించింది. బజాజ్‌గారు ఆ నిషేధాన్ని ఉల్లంఘించకుండా, తాను చేయదలచుకొన్న పనిని గురించి సంస్థాన ప్రభుత్వానికి విపులముగా తెలుపుతూ నిషేధాన్ని ఉపసంహరించుకొనవలసినదని ప్రభుత్వాన్ని కోరుతూ జాబు వ్రాశాడు. ఆ జాబులోనే, నిషేధాన్ని జనవరి 31 వ తేదీలోపుగా ఉపసంహరించుకోకపోతే తాను దానిని ఉల్లంఘించి సంస్థానంలో ప్రవేశించవలసి వస్తుందని స్పష్టముగా తెలియజేశాడు. మహాత్మా గాంధీగారుకూడ అదే విషయాన్ని తెలుపుచూ ఒక ప్రకటన చేశారు.

కాని బ్రిటిషు ప్రభుత్వం యొక్క చేతులలో కీలుబొమ్మలుగా ఉండి వారు చెప్పినట్లల్లా ఆడే సంస్థాన ప్రభుత్వాలు యీపాటి చిన్న సదుపాయాన్ని కూడా ప్రజలను అనుభవించనిస్తాయా? ప్రభుత్వం తాను ప్రకటించిన నిషేధాజ్ఞను ఉపసంహరించుకొనే బదులు నిర్బంధ విధానాన్ని ఎక్కువ చేసింది. సంస్థాన ప్రజామండలి అక్రమ సంఘమని ప్రకటించింది. మిగిలిన సంఘాలన్నీ ప్రభుత్వముచేత రిజిష్టరు చేయబడాలనీ, లేకుంటే వాటిని కూడా నిషేధిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. సికార్ రాజకీయ ఖైదీలను విడుదల చేయవలసిన అవసరమే లేదంది. బజాజ్ గారిపై గావించిన నిషేధాన్ని తొలగించనే లేదు.

జయపూర్ చర్యను ఖండిస్తూ బజాజ్‌గారిపై నిషేధాన్ని తొలగించేటట్లు చేయవలసినదని మహాత్మాజీ వైస్రాయికి జాబు వ్రాశాడు. జయపూర్‌లో బాధ్యతాయుత ప్రభుత్వంకోసం గాక వాక్సభా స్వాతంత్ర్యాల కోసమే సత్యాగ్రహం జరుపవలసి వస్తుందని ప్రకటించాడు.

కాని ఏవిధమైన సమాధానమూ రాలేదు. బజాజ్ గారు సత్యాగ్రహానికై తలపడ్డారు. తన తరువాత సత్యాగ్రహాన్ని సాగించడానికి ఒకకార్యాచరణసంఘాన్ని ఏర్పాటుచేసి బజాజ్‌గారు జయపూర్‌కు బయలుదేరారు.

జయపూర్ స్టేషనులో దిగడంతోటే సంస్థానాధికారులు వారిని ఎరస్టు చేసి సంస్థానం వెలుపలికి తీసుకువెళ్ళి విడుదల చేశారు. బజాజ్ గారు తిరిగి సత్యాగ్రహం చేయుట నిశ్చయించారు. ఈసత్యాగ్రహం యము ప్రభుత్వ అధికారులు "దౌర్జన్యము చేసి గాని జయపూర్ బయటికి నన్ను పంపజాలరు" అని ప్రకటన చేశారు.

# రాష్ట్ర విద్యార్థి సంఘ తీర్మానాలు

29-1-39 : వ తేదీ ఆదివారంనాడు బెజవాడ కమ్మహాస్టలులో నూతనంగా ఎన్నుకొనబడ్డ ఆం॥ రా॥ విద్యార్థిసంఘ కార్యనిర్వాహక వర్గం కామ్రేడ్ వై. వి. కృష్ణారావుగారి అధ్యక్షతను సమావేశమై యీ క్రింది తీర్మానములు ఏకగ్రీవముగా అంగీకరించెను.

1. సంయుక్త కార్యదర్శులుగా ఆయాజిల్లాలకు యీ దిగువ పేర్కొనబడినవారు యెన్నుకొనబడిరి:

వై. వి. కృష్ణారావు (గుంటూరు)
యస్. వి. రంగారావు (కృష్ణా)
సి. హెచ్. వెంకటేశ్వరరావు (తూ॥గో॥)
యం. వి. రాఘవేంద్రరావు (ప॥ ॥)
ఇ. రాజగోపాలరెడ్డి (నెల్లూరు)
కె. వెంకటరామశాస్త్రి : కోశాధికారి.

2. విద్యార్థి ఉద్యమాన్నిగురించి పత్రికలకు వ్యాసములు వ్రాయుబాధ్యత వై. నరసింహారావు (గుంటూరు), వి. భాస్కరరావు (బెజవాడ)గార్లకు ఈయబడినది.

3. ఈ సంవత్సరం ఏప్రిల్ 20 వ తారీఖు నుండి మే 1 వరకు ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘముతరఫున కృష్ణాజిల్లా విద్యార్థిసంఘ సహకారముతో, కృష్ణాజిల్లాలో ఒక విద్యార్థుల ట్రెయినింగు క్యాంపు; మే 2 మొదలు ఆరువారముల వరకు జిల్లాలో వయోజన విద్య ప్రచారము గావించుటకు తీర్మానింపబడ్డమైనది.

యువజన సంఘము తరఫున కాట్రగడ్డ రాజగోపాలరావుగారిని, విద్యార్థి సంఘము తరఫున వై. నరసింహారావు, జి. దుర్గాప్రసాద్, యస్. వి. రంగారావు, వి, భాస్కరరావు గార్లను ట్రెయినింగ్ క్యాంపు నడుపుటకును. ఆర్థిక విషయములను ఏర్పాటు చేయుటకును అధికార మీయబడ్డమైనది.

పై కార్యక్రమమును నడుపుటకు అయ్యే ఖర్చులో సగము, అనగా రూ 50 లు కృష్ణా జిల్లా విద్యార్థి సంఘమువారును, మిగతా రు 50 రాష్ట్ర సంఘమువారును సమకూర్చుటకు తీర్మానించబడ్డమైనది.

4. ఆయా జిల్లాలలోని విద్యార్థి ఉద్యమమును గురించి. ప్రాథమిక సభ్యుల పట్టికలు, చందాలు, కార్యక్రమము మొదలైన వాటిని గురించి రిపోర్టులు ప్రతిమాసమున, ఫిబ్రవరి 26 లోగా జనరల్ సెక్రటరీ కార్యాలయమునకు జిల్లా కార్యదర్శులు పంపులాగున ఆయా జిల్లా సంయుక్త కార్యదర్శుల బాధ్యత అయిఉన్నది.

ఈ కార్యక్రమమును సంయుక్త కార్యదర్శి నెరవేర్పలేక పోయినయెడల, తదుపరి సంయుక్త కార్యదర్శిగా ఉండజాలరు.

5. 15 వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ తాలూకు జమాఖర్చు లెక్కలు జనరల్ సెక్రటరీ నెల లోపల ప్రచురించవలెను.

6. మహాసభ తాలూకు 93 రు ప్రతినిధుల ప్రతినిధి రుసుములో సగం, అనగా రు 46-8-0 కోశాధికారికి యివ్వవెయ్యబడ్డమైనది.

7. ప్రాథమిక సభ్యుల చందాలో 1 కాని అ. భా. విద్యార్థి ఫెడరేషన్‌కూ, 2 కానులు రాష్ట్ర సంఘమునకు, మిగిలిన మొత్తములో మూడవవంతు జిల్లా సంఘమునకు—మూడింట రెండు వంతులు స్థానిక యూనియన్లకు చెందును.

8. కోల్పడు చేసుకొనవలసిన సభ్యులను జనరల్ సెక్రటరీ, జిల్లా సంఘ సహకారంతో ఒక నెలలోపల యితర సభ్యులకు తెలియపరచి, వారి ఆమోదమును బడయవలెను.

జి. రామకోటేశ్వరరావు,
జనరల్ సెక్రటరీ

★ ★ ★

ఆంధ్రదేశంలో, ముఖ్యంగా కృష్ణాజిల్లాలో డిటెన్షను పద్ధతిని నిర్మూలించ డానికిగాను విద్యార్థులు తీవ్రతరమైన పోరాటాలను జరిపారు. చాలమంది పెద్దలుకూడా డిటెన్షను పద్ధతికి తమ వ్యతిరేక భావాన్ని ప్రకటించారు. విద్యాశాఖా మంత్రి శ్రీయుత వార్కీగారి వద్దకు రాయబారం పోగా. డిటెన్షనులు స్వల్పముగా నుండుననియు సమ్మెలో పాల్గొన్న విద్యార్థులను శిక్షింపమనియు, చెప్పిరి. కాని గన్నవరం, తాడంకి-పామర్రు మొదలగు ప్రదేశములలో డిటెన్షనులు నూటికి 37 వరకు పోయినవి. అనేకచోట్ల విద్యార్థులను భయపెట్టుటయు జరుగుచున్నది.

మరియు, ఉపాధ్యాయులు సమ్మెను మనస్సులో నుంచుకొని విద్యార్థులను శిక్షింప నుంకించుచున్నట్లు రిపోర్టులు వచ్చుచున్నవి. విద్యార్థుల ఆందోళన ఉపాధ్యాయుల మీద గాదనియు, గురుశిష్యుల మధ్యనుండు సంబంధము చెడనపుసరము లేదనియు, మొదటి నుండియు మేము చెప్పుచున్నాము. విజ్ఞానధనులగు ఉపాధ్యాయులకీ విషయమును తిరిగి గుర్తుజేయవలసి వచ్చుట విచారకరము. మేము ఉపాధ్యాయులతో పోట్లాడుట లేదని మరల మరల సవినయముగా చెప్పుకొను చున్నాము.

కాంగ్రెసుమంత్రివర్గము వారు తాము ప్రజాబలముమీద నాధారపడి యున్నామనియు, ప్రజాభిప్రాయమును నిర్లక్ష్యము చేయజాలమనియు, పదేపదే చెప్పుచున్నారు. వడపోత డిటెన్షన్ (detention) పద్ధతిని విద్యార్థులేగాక ఉపాధ్యాయులు, ప్రజాసామాన్యము కూడ ఖండించుచున్నారు. ప్రధానోపాధ్యాయులు సహితము తాము పైఅధికారులకు బద్ధులమనియు, వ్యక్తిగతముగా తాము డిటెన్షను పద్ధతిని నిరసించుచున్నామనియు, చెప్పిరి. చివఱకు డి. యి. ఓ. గారు కూడ నట్లేచెప్పిరి. పట్టణవాసులు అనుభవజ్ఞులగు వకీల్లుకూడా యీ పద్ధతిని నిరసించిరి. కాబట్టి, లోపభూయిష్టమైన నేటి విద్యావిధానంపైననే విద్యార్థుల ఆందోళన కాని ఉపాధ్యాయుల మీద కాదు. ప్రజాభిప్రాయమును నిర్లక్ష్యము చేయమని చెప్పు మదరాసు మంత్రివర్గము డిటెన్షను పద్ధతిని నిర్మూలింపజాలమనుట శోచనీయము. ఈ పద్ధతిమీద ప్రజలలో నున్న యసంతృప్తిని తెలిసికొనియూ వారు ముభావము వహించుట గర్హనీయము. చివఱకు మంత్రిగారు చేసిన వాగ్దానమును సహితం అమలు పరుపకుండుట సహింపజాలము.

మించిపోయినదిలేదు. విద్యాధికారులు తమ మూర్ఖత్వమును వదలి మఱల పరీక్షలను జరిపి మిగతా విద్యార్థులను కూడ పరీక్షకు పంపవలయునని కోరుచున్నాము. మంత్రిగారు జనవరి 23 వ తారీఖున పరీక్షలుపెట్టెదమని వాగ్దానం చేసిరి. అట్లు పెట్టమని ప్రధానోపాధ్యాయులను మేము ప్రార్థించినను, నిరాకరించిరి. మంత్రిగారు రహస్యముగా వారికట్లు నిరాకరించమని చెప్పిరా? కాంగ్రెసు మంత్రివర్గమువారు విద్యార్థులలో పలుకుబడి పోగొట్టుకొన వలదని హెచ్చరించుచున్నాను.

పిన్నమనేని సత్యనారాయణ, బి. ఏ..
ప్రధానకార్యదర్శి.
కృష్ణాజిల్లా విద్యార్థిసంఘము.

★ ★ ★

ప్రస్తుత విద్యావిధానమొక పెనుభూతం.

4-2-39 వ తేదీని బెజవాడ మ్యునిసిపల్ హైస్కూలునందు స్టూడెంట్సు లిటరరీ ఎసోసియేషన్ వారి యాజమాన్యమున స్కూలు పైనలు విద్యార్థియైన డి. బి. వి. కృష్ణయ్య చౌదరిగారి అధ్యక్షతను విద్యార్థుల సమావేశము జరిగెను. ఆసభలో యీక్రింది తీర్మానములు యేకగ్రీవముగా అంగీకరింపబడినవి.

1. అఖిలభారత కాంగ్రెసు సంఘమునకు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిన శ్రీ సుభాషు చంద్రబోసుగారిని అభినందించుచు, విద్యార్థుల కష్టముల నీడేర్చుటకు ప్రయత్నించ వలసినదిగా వారిని కోరుచు యీ సభవారు తీర్మానించడమైనది.

2. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమునకు డా॥ పట్టాభి సీతారామయ్యగారు ఏకగ్రీవముగా రాబోవు సంవత్సరమునకు తిరిగి యెన్నుకొనబడినందుకు వారిని అభినందించుచు, విద్యార్థుల కోర్కెల సఫలీకృతము చేయుటయందు శ్రీవారు శ్రద్ధ వహించెదరని యీ సభవారు నమ్ముచున్నారు.

3. ప్రస్తుత విద్యావిధాన మొక పెనుభూతం వలె విద్యార్థులను మానసికముగను, ఆర్థికముగనునాశనము చేయుచున్నందునను, బ్రిటిషు సామ్రాజ్య తత్వమునే యిది యెక్కువగా పురికొల్పుచున్నందునను అట్టి విద్యావిధానమును వెంటనే రూపుమాపి, విద్యార్థుల శ్రేయస్సును కోరి, వార్ధా విద్యావిధానమును యీ రాజధానిలో వెంటనే అమలుపరచవలసినదిగా ప్రస్తుత మద్రాసు ప్రభుత్వమువారిని కోరుచూ యీ సభవారు తీర్మానించడమైనది.

4. ఇటీవల యీ స్కూలులోజరిగిన సమ్మె విషయములో అధికారులు వాగ్దానమిచ్చిన ప్రకారముగా మహమ్మదీయ విద్యార్థి సారస్వత పోటీలకుసంబంధించిన వెండికప్పును వెంటనేస్కూలునందు పునర్నిర్మాణము చేయవలసినదిగా కోరుచూ, యింతవరకట్టి ప్రయత్నము చేయనందులకు వారి చర్యను నిరసించుచు యీ సభవారు తీర్మానించడమైనది.

5. మహమ్మదీయ విద్యార్థుల తరఫున వుర్దూ వార్తాపత్రికలు, స్కూలు గ్రంథాలయమునకు జాతీయపుస్తకములు (అన్ని భాషలలోను) యింతవరకేమియు తెప్పించనందున, అధికారులచర్యను నిరసించుచు వెంటనే వాటిని సప్లయి చేయవలసినదిగా స్కూలు హెడ్మాష్టరుగారిని, మ్యునిసిపల్ కమీషనరుగారిని కోరుచు యీ సభవారు తీర్మానించడమైనది.

6. లోగడ జనవరి 31 వ తారీఖున జరిగిన మద్రాసు కౌన్సిలు సమావేశము నందు ఎం. నారాయణరావుగారి "తెలుగు పండితుల జీతములను" గూర్చి అడిగిన ప్రశ్నకు, "ఇతర అధ్యాపకుల జీతములతోపాటు హెచ్చించుటకు ప్రభుత్వమునకు అవసరము కనుపించుట లేదనియు, తెలుగు పండితులకు జీతములు హెచ్చించు ప్రపోజల్సు ఏమీ ప్రభుత్వము యెదుట లేవనియు" మద్రాసు ప్రభుత్వపు విద్యాశాఖా మాత్యులుగారిచ్చిన సమాధానము అసంతృప్తిగా నున్నదనియు, శ్రీవారు అట్టి భావమును మార్చుకొన వలసినదని వారిని ప్రార్థించుచు యీ సభవారు తీర్మానించు చున్నారు.

స్వాతంత్ర్య దినోత్సవంలో పాల్గొన్న కాకినాడ విద్యార్థులు.





# ఆంధ్ర కార్మికోద్యమ కేంద్రీకరణము

కామ్రేడ్ కె. యల్. నరసింహం, బి. ఏ.

ఆంధ్ర దేశములో కార్మికోద్యమము, దిన దినాభి వృద్ధి జెందుతున్నది. ఇచ్చట కార్మిక వర్గము, స్వల్పమైనా కార్మికులు, వర్గ పోరాటములను నడిపేందుకు వర్గ సంస్థల అవసరమును గుర్తించారు. ప్రతి పరిశ్రమలలోని కార్మికులు, తమ ట్రేడ్ యూనియన్లను, వృద్ధి జేస్తూ, యజమానుల దోపిడీ విధానమును ఎదుర్కొనటం సాగించారు. ఎక్కువ కూలీకి, తక్కువ గంటల పనికి సమ్మెలు చేసారు.

చీరాల పొగాకు కంపెనీలో పని జేసే కార్మికులు, ఎక్కువ కూలీకి. తక్కువ గంటల పనికి. ప్రావిడెంటు ఫండు కొరకు గొప్ప పోరాటము సాగించారు. నాయకత్వపు లోటువల్ల, పోలీసులు కార్మికులపై తుపాకులు పేల్చటంచేత, మద్రాసు ప్రభుత్వపు ధోరణి కార్మిక హక్కులకు భంగకరమగుటచేత, కార్మికులు ఓడిపోయారు. స్థానికముగా వుండి, కార్మికుల రోజు రోజు కష్టాలలో పాల్గొనక పోవుటచేత, సోషలిస్టులు ఆ పోరాటమునకు నాయకత్వం వహించలేక పోయారు. పోలీసు కాల్పులను మద్రాసు కాంగ్రెసు ప్రభుత్వం సమర్థించి యజమానులు, అనగా బ్రిటిషు పెట్టుబడిదారులు, కార్మికుల పైన తీసుకొని వచ్చిన ఒత్తిడికి సహాయ పడినది. ఆ పరిస్థితులలో ఆంధ్ర కార్మిక వర్గం ప్రభుత్వముపైన, తగినంత ఒత్తిడి తీసుకొనిరాలేక పోయింది. కనీసము యజమానులకు, కార్మికులకు వచ్చిన తగాదాను పరిష్కరించుటకు కోర్టు ఆఫ్ ఎన్‌క్వైరీ (Court of Enquiry) అయినా ఏర్పాటు చేయించలేక పోయింది. సామర్లకోట పంచదార ఫ్యాక్టరీ కార్మికులు. బ్రిటిషు పెట్టుబడిదారులు తీసుకొని వచ్చిన రిట్రెంచిమెంటు విధానమునకు, వ్యతిరేకంగా సమ్మె సాగించారు. అచ్చటి ట్రేడ్ యూనియన్ ఆ వర్గ పోరాటమునకు నిజమైన నాయకత్వం వహించింది. మద్రాసు ప్రభుత్వము చెప్పిన తియ్యని మాటలను, ఆంధ్ర కార్మిక వర్గము అమలు జరిపించలేకపోయింది. చిట్టివలస జ్యూట్ కార్మికులు రిట్రెంచిమెంటుకు వ్యతిరేకంగా 2 నెలల పైగా సమ్మె సాగించారు. కార్మికులు జూపిన పట్టుదలకు, ఐకమత్యమునకు మద్రాసు ప్రభుత్వము కోర్టు ఆఫ్ ఎన్‌క్వయిరీ ఏర్పాటు చేసింది. వారిచ్చిన సలహాలను, యజమానులు అమలు జరపటము నిరాకరించు చున్నారు. ఈ రోజున అన్ని ట్రేడ్ యూనియన్లు వారి వెనుక ఉంటే, వారు సాగించుచున్న పోరాటము గెలవక తప్పదు. వారి జయమే ఆంధ్ర కార్మికవర్గము జయమవుతుంది. ప్రతి పట్టణములోను ప్రెస్ వర్కర్సు యూనియన్లు ఏర్పడినవి. ప్రతి ప్రెస్, ఫ్యాక్టరీ యాక్టు క్రిందకు వచ్చేటట్లుగా చేయాలని, ఆంధ్ర రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ ఆందోళన చేసింది. కాని ప్రభుత్వం పెడచెవిని పెట్టింది. వీరితోపాటు ఇతర ట్రేడు యూనియన్లుకూడా కలసి ఆందోళన సాగించితే, ప్రభుత్వం కార్మికుల శక్తికి లొంగక తప్పదు. ప్రతి పట్టణములో జట్కా బండ్ల యూనియన్, స్థానిక పోలీసు బాధలకు వ్యతిరేకంగా, బండ్ల లైసెన్సు తగ్గాలని సమ్మెలు చేసారు. చాలా పట్టణాలలో మున్సిపాలిటీలు కాంగ్రెసువారి చేత నడిపించబడుచున్నా, బండ్ల వారి కష్టాలు పోలేదు. దీనికి కారణము కార్మిక సంఘాలన్ని కలసి. కాంగ్రెసులో తగినంత వత్తిడి తీసుకొనిరాక పోవటమే. రైల్వే కార్మికులు తమ ట్రేడు యూనియన్‌ను వృద్ధిజేసుకున్నారు. రోజు రోజు కష్టాలలో పాల్గొంటూ ఉంది యూనియన్. కాని రైల్వే కార్మికులు యితర కార్మికులతో కలసి స్వాతంత్ర్య పోరాటంలో తమ బాధ్యతను నెరవేర్చాలి. మోటారు కార్మికులలో కూడ చలనము కలుగుతున్నది. తోళ్ళ పనివారి సంఘాలు ఏర్పడినాయి గాని పనిచేయటంలేదు.

ప్రతి పరిశ్రమలోను, కార్మికులు తమ నిత్య జీవితంలో తమ యజమానుల దోపిడీ విధానమును ఎదుర్కొనుట, పెట్టుబడిదారి ఆర్థిక విధానములో ట్రేడ్ యూనియన్ నిర్వర్తించవలసిన పాత్రలో మొదటిది. మార్క్సు ఈ విధముగా జెప్పాడు "ట్రేడ్ యూనియన్లు. ఇంతవరకు పెట్టుబడికి వ్యతిరేకంగా స్థానికముగా ప్రత్యక్ష పోరాటములోనే నిమగ్నమైనది. ప్రస్తుత వుత్పత్తి విధానాన్ని, బానిస శ్రమ జీవిత పద్ధతిని, ఎదుర్కొనుటకు గల తమ శక్తిని యింకా గ్రహించలేదు. ట్రేడు యూనియన్, నిర్మాణ కార్యక్రమముతో పాటు, కార్మిక వర్గాన్ని కూడదీసి, వర్గ లాభం కోసం పోరాటమును ముందుకు తీసుకొని పోయేందుకు తయారు కావాలి. ఈ ఉద్దేశము కొరకు జరిగే సాంఘిక, రాజకీయ ఉద్యమాలలో పాల్గొనాలి." కాబట్టి అక్కడక్కడ జరిగే పోరాటములను నడపడమే కాదు ట్రేడ్ యూనియన్ పని. స్థానికంగా జరిగే పోరాటాలన్నీ క్రోడీకరించి, మొత్తం పెట్టుబడిదారీ విధానమునకు వ్యతిరేకముగా వర్గ పోరాటాన్ని నడపాలి. ఈవిధంగా ప్రతి ఆర్థిక పోరాటం రాజకీయ ఉద్యమముగా మారక తప్పదు. ఒక ఫ్యాక్టరీలో రోజుకు 8 గంటలు పనికొరకు జరిపే పోరాటమే 8 గంటల శాసనము కొరకు రాజకీయ ఉద్యమముగా రాక మానదు. ఆ ఉద్యమమును నడిపినప్పుడే ట్రేడ్ యూనియన్ వర్గ పోరాటమును నడిపే సంస్థ అవుతుంది. ఇందువల్ల కార్మికోద్యమమును విప్లవ మార్గాల నడపాలంటే, ఆంధ్రరాష్ట్రములో ట్రేడ్‌యూనియన్ల ఐక్యత కావాలి.

ఈరోజున యీ రాష్ట్రంలోని ట్రేడు యూనియన్లను నూతన సమస్య ఎదుర్కొంటూ ఉన్నవి. ప్రతి యజమాని కార్మిక సంఘములను గుర్తించ నిరాకరించుచున్నాడు. అనేక షరతులు కోరుతున్నారు. హార్బరు కార్మిక సంఘము వారికి, వాని సభ్యత్వపు లిస్టులను, జమ ఖర్చు లెఖ్ఖలు వారు పరిశీలించేందుకు హక్కు వుండాలన్నారు. సమ్మెకు 14 రోజుల నోటీసు కావాలిట. యింకా అనేకం వున్నవి. చిట్టివలస కార్మికసంఘమువారు వర్గ కలహాన్ని ప్రచారము చేయకుండా వుండాలని యజమానులు హామీ అడిగారని తెలుస్తూన్నది. రైల్వే దొరలు కూడా ఈరోజున ఒక నియమావళిని తయారుచేసి దానిని ఒప్పుకొన్న యూనియన్లనే గుర్తిస్తా మంటూన్నారు. చీరాల దొరలు కూడా విచిత్రమైన షరతులను పెట్టారు.

ఇట్టి షరతులతో రికగ్నిషన్ పొప్పుకొనుటా అనే సమస్య వస్తున్నది. షరతులతో వున్న రికగ్నిషన్‌తో యజమానుల కీలు బొమ్మ లయ్యేదానికన్న రికగ్నిషనే లేకుంటే మంచిది, కాని యూనియన్ రికగ్నిషన్‌వల్ల కార్మికవర్గమునకు పూర్తి బలం చేకూరుతుంది. యజమానులతో బేరమాడు శక్తిని ఎక్కువ జేస్తుంది. దీనివల్లనే రాయల్ కమీషన్ కూడా ప్రతి ట్రేడ్ యూనియన్ని యజమాని నిర్బంధంగా రికగ్నైజ్‌చేయాలని సూచించారు. కాంగ్రెసు మంత్రుల వద్ద నుంచి అట్టి శాసనముల కొరకు ఆంధ్ర దేశములోని ట్రేడు యూనియన్లు కలసి ఆందోళన సాగించాలి. ప్రతి సంఘమును యజమానులు నిర్బంధముగా రికగ్నైజు చేసేటట్లు శాసనము కావాలి.

కావున ఆంధ్ర రాష్ట్రములో ఉన్న ట్రేడు యూనియన్లు, మద్రాసు రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ద్వారా అఖిల భారత ట్రేడు యూనియను కాంగ్రెసుకు అనుబంధముగా వెంటనే జేరాలి.

ఆంధ్ర రాష్ట్రములో ట్రేడు యూనియన్ల ఆఫీసర్లు సమావేశమయి ఒక కార్యక్రమమును నిర్ణయించుకోవాలి. అట్టి సమావేశమును జరిపేందుకు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ జేయుచున్న ప్రయత్నాలతో అన్ని ట్రేడు యూనియన్లు సహకారం చేయాలి.

## కిటికీ

( 7 వ పేజీ తరువాయి )

తారుమనిషి: (తారు కిటికీకంతకు పులమటం మొదలెట్టి, పగిలపోయిన అద్దపు ముక్కలకు కూడ తారు పులిమివేస్తాడు) పాపంలాగ—నల్లగ—పాపంలాగ నల్లగ—తారంటే, అదే—మరి నాపని నేను చేసి కొంటున్నాను. అంతే.

భార్య: అతను పిచ్చివాడా? ఏమిటి తను చేస్తున్నది.

కూలివాడు: కిటికీకి, మిగిలిన అద్దపు ముక్కలకి తారుపులుముతున్నాడు. ఆ కొద్దిమంది ఓ క్రొత్తశాసనం తయారు చేసి అమలులో పెట్టారు. వాళ్ళిప్పుడు వెల్తురుమీద పన్ను వేస్తున్నారు.

భార్య:— వెల్తురుమీద పన్నా? మరి తిరిగి ఇంకెప్పుడూ మన ఇండ్లలోకి వెల్తురు రాదా?

తారుమనిషి;— ఇంకరాదు. దానికి పన్ను చెల్లించేవరకు. దానికి ఓ కొలత వుంది. ఆ ప్రకారం సూర్యునివెల్తురు కొనుక్కోవచ్చు. మరి దండాలు బాబు: గుడ్‌నైట్: టహో: గుడ్ మార్నింగు. (బాల్చీతోటి. కుంచెతోటి బయటికి పోవును.)

కూలివాడు;— వెల్తుర్నికూడా దొంగిలించుకు పోతున్నాడు. పట్టపగలు దొంగతనమంటే అదే.

భార్య;— మరి త్వరలోనే వాళ్లు అన్నింటిమీద పన్నువిధిస్తారు. మనకళ్లకి, మన పిల్లల కళ్లకి గంతలు కడతారు. మన నోళ్లకి మూతలుకూడా వేస్తారేమో, ఒకవేళ మన కలలమీద, పాటలమీద, మన సుఖ దుఃఖాలమీదకూడా పన్నువేస్తారేమో, వాళ్లు అన్నింటిమీద పన్నువేస్తారు.

కూలివాడు;— కాని, మన ప్రార్థనలమీద మంత్రాలమీద పన్ను వేయరు. ఎందుచేతనంటే వాటిని స్వతంత్రంతో అక్కడక్కడున్న దేవునికిఅర్పించాలి. (ప్రతిజ్ఞతో గుప్పిళ్లను ఆకాశంవైపు విసురుతూ.) ఎవడు ప్రతిదీ, సమస్తమూ చూస్తూన్నప్పటికీ ఒక్కమాటైనా అనడో అతడు మన దేముడు: మన దేముడు: పెద్దపెద్ద భూస్వాములకు, మిల్లుదార్లకు పూర్తిగ అమ్ముడు పోయాడు. నిశ్చయంగా అమ్మీ: ఒకవేళ నీ శరీరంమీదకూడా పన్ను వేస్తారేమో మరి నేనప్పుడు ప్రేమించేటప్పుడల్లా పన్ను చెల్లించుకుంటూండాలేమో.

భార్య:- ఓకృూరత్వం. కౄరమైన కర్మ. ఇదంతా నిజమే:

కూలివాడు;- సందేహమేముంది. నిజం ముమ్మాటికి నిజం అయినప్పటికి ఈ దినం ఇదంతా ఒక పెద్ద నికృష్టమైన అబద్ధంలాగ కనిపిస్తోంది వాళ్లంతా నీచులు.

(పట్టణమవతల గంట ఏడుగంటలు కొడుతుంది.)

భార్య:— ఎంత కొట్టుతూంది గంట? ఇంకేముంది. ఏడుగంటలు మరి దీపం కొండెక్కుతూంది. ఓయి దేముడా ఎంత కారుచీకటి. సమస్తం కారు చీకటిమయం.

కూలివాడు;— శవాలుండే గదిలాగు ఎంత చీకటిగా వుంది గ్రుడ్డివాని కళ్ళకు కనుపించే కాంతిలాగ సుసిబొగ్గు కాంతిలాగ కూలీలు (పిచ్చివానిలాగ కేక వేస్తాడు.) కూలీలు; కూలీలు:

జ్యోతి, అజు:- (చీకటిలో నడుస్తూ) అమ్మా, నాన్నా: మన మెక్కడున్నాము? (కలకలముతో కూడుకొనిన సంచారం గదులలోను, సందులలోను బయలుదేరి నట్లుంటుంది.)

కూలివాడు:- మరి సుప్రభాతం, బయట నిరీక్షిస్తూ ఉండాలి మన కందరకు ఏమైవుంటుందో అని ఆశ్చర్యపోతూ నిరీక్షిస్తో వుండాలి. వెల్తురు: వెల్తురు: అమ్మీ నీవు చెప్పింది నిజం. ప్రతివస్తువు ఎప్పుడో ఒకప్పుడు బద్దలవకమానదు. వెల్తురు: వెల్తురు: వెల్తురు: (కిటికీ అద్దము బ్రద్దలు కొడతాడు........ చుట్టూ పొరుగునంతా కిటికీ అద్దపు తలుపులు బ్రద్దలు కొడుతూన్న శబ్దమే) ఆఖరికి మనం ............ అంటున్నారు మనము వాళ్లని. ఇన్నాళ్లకి వెలుతురు, వెలుతురు కూలివాని ఇంట్లో.......ఎల్లప్పుడు.

(నవయుగోదయ జీవితము కార్మికులకు చూపు చక్కని, అరుణకాంతి, ఇంటిలోనికి ప్రసరిస్తుంది)

# రైతులోకం

## కోడూరు కరణంగారి కొంటెతనం.

నార్త్ మైలవరం ఎస్టేటు కోడూరు గ్రామములోఉన్న 120 యకరముల ఈనాం పల్లంలో కొంతభాగం గణపవరం కాపురస్థుడైన ముప్పిడి జమలారెడ్డి అనే ఒక రైతుయొక్క భుక్తంలో ఉన్నది. దానిని గత గవర్నమెంటు సెటిల్మెంటులో యీనాం నుంచి విడగొట్టినట్లును, దా..కి యకరము 1 కి 5 రూపాయల చొప్పున య 1—54 సెంట్లకు రు 7-11-4 శిస్తు—రూపాయకు 0—1—7 ల చొప్పున సెస్సు తొమ్మిది సంవత్సరాల నుంచి వసూలు చేసుకొనే అధికారం జమీందారుగారి కున్నదని 19-5-37 వ తేదీని కోడూరు కరణంగారు 1338 ఫసలీ లగాయతు 1346 ఫసలీ వరకు అయిన మొత్తం రు 76-5-0 లకు తనపేర ప్రోనోటు వ్రాయించారు. ఆభూమికి కొత్త సర్వే నెంబరు 56 అంకెను సృష్టించి. శ్రీకృష్ణారావు జమీందారుగారి దస్కతుగల పట్టాను 1346 ఫసలీకి యిచ్చారు. పట్టాలో దస్తూరి కుప్పా రామచంద్రయ్య. ఎస్టేటు సర్వేయరుది. సాక్షులు: కొమ్మాలపాటి హనుమయ్య (నోటు వ్రాయించుకున్న కరణం). మలరాజు జమలయ్య (ఎస్టేటు మొహతాదు), వెలగలేటి చిన వెంకటసుబ్బయ్య (అడవిని దరఖాస్తుకు యిస్తామని ఆశపెట్టగా నమ్మి చెడిపోయిన బీదరైతు) పట్టాయొక్క పుట్టుక 1346 వ ఫసలీ. శిస్తు: గత 8 సంవత్సరములు కలిపి, ఆమొత్తముకే పట్టా. ఆ తేదీననే కరణంపేర నోటు.

ఇప్పుడు 40 రూపాయలిస్తే రాజీ యని రాయబారం. కమలారెడ్డి తమ్ముడు తగాదా పెట్టి, నోటు బాకీనే ఒప్పుకోను, బాకీఉంటే జమీందారుగారికి వ్రాయాలిగాని కరణంపేర ఎందుకని అనుచున్నాడు.

* * *

## మునసబుగారి దురన్యాయం

ఒక విలేఖరి యీవిధంగా వ్రాయుచున్నాడు.

ఏజన్సీ చోడవరం డివిజన్, రామచంద్ర గ్రామంలో పొందు దొడ్డిని తీసివేసి, అస్థలం గవర్నమెంటువారు వేలంవేశారు. గ్రామస్థులు సదరు గ్రామపుమ్మడిని పాడుకుందామని నిశ్చయించుకున్నారు. పాటకుముందు మునసబుగారు తాను దానిని పాడి, తరువాత గ్రామస్థులకు యిచ్చివేస్తానని వాగ్దానం చేస్తే, అందుకు అంగీకరించారు. పాట 31 రూపాయిలకు కొట్టివేయబడింది. ఖాయపు అర్జీలుకూడా వచ్చాయి, కాని, రామచంద్రపురం రైతులు సదరు పాటసొమ్మను తీసుకొనివెళ్ళి మునసబుగారికి ఇవ్వబోతే దానిని పుచ్చుకొనక కాలయాపనచేశారు, రైతులు తమకిష్టం వచ్చినరీతిని గ్రామపుమ్మడిని ఉపయోగించుకొనవచ్చునని ఆయన అన్నారు. ఆ కారణంచేత గ్రామస్థులు కొంతమంది మాలలచేత ఒక ఓంతచెట్టును నరికించారు. వెంటనే 12 గురు మాలలమీద, పెండ్యాల సత్యం అనే వారిమీద మునసబుగారు మేజస్ట్రేటు కోర్టులో అన్యాయంగా చార్జీ దాఖలుచేశారు. కాని అది కోర్టులో కొట్టివేయబడింది. దానిపై పెండ్యాల సత్యంగారు మునసబుగారిమీద రాజమండ్రి సబ్‌కలెక్టరుగారి కోర్టులో పరువునష్టం దావా చేశారు. రాజమండ్రితాలూకా కాంగ్రెస్ సంఘాధ్యక్షులైన శ్రీ నీరుకొండ వెంకటరత్నంగారు ఉభయపార్టీల అనుమతితో సదరుకేసును సమగ్రంగా విచారించి, తమ అభిప్రాయమును కలెక్టరుగారికి పంపగా కలెక్టరుగారు దానిని అంగీకరించి తీర్పు యిచ్చారు. దావాలో కొంతసొమ్ముకుమాత్రమే డిక్రీ యివ్వబడింది. ఈ తీర్పు గ్రామస్థులకు మిక్కిలి అనుకూలంగా ఉన్నది. దొడ్డిస్థలమును రాబట్టుకొనుటకు వారు దావా చేయుటకు పూనుకొన్నారు.

* * *

## బొబ్బిలి ఎస్టేటుఉద్యోగుల అత్యాచారాలు.

బొబ్బిలి ఎస్టేటులో సంకిలి అనే గ్రామమునకు కొందరు ఎస్టేటు ఉద్యోగులు పోలీసు బందోబస్తుతోవచ్చి, యిద్దరి రైతుల తాలూకు వరికుప్పలు జప్తుచేసి, ఎట్టి క్రమమైన అంచనా వేయక, మరొకస్థలమునకు మోసుకొనిపోయిరి. జప్తుచేసిన వరికుప్పలకు కాపలాకాయించుట ఉద్యోగుల ధర్మముకాని, వారి యిష్టం వచ్చినచోటికి జబర్దస్తీగా తీసుకొని పోవుటకు ఎట్టి అధికారం లేదు. ఈ అక్రమ చర్యను గురించి రైతులు టెలిగ్రాములద్వారా మదరాసు ప్రభుత్వమునకు తెలియజేశారు.

* * *

## వెంకటగిరి ఎస్టేటు రైతుల కడగండ్లు.

వెంకటగిరి ఎస్టేటులో కోమటిగుంట్ల గ్రామానికి పాళ్ళాపురం చెర్వు అనే చెరువు ఉండేది. ఈచెరువు 1931 లో సంభవించిన తుపానువల్ల 3 గండ్లు తెగి, చెరువుక్రింది భూములు దున్నుకొనే రైతుల జీవనాధారం పడిపోయింది. 30 యిండ్ల కుటుంబాలు గ్రామం విడిచి యితర గ్రామాలకు వెళ్ళిపోయారు. మిగిలిన వారు మన్నేరు మోటలు తోలుకొని, సజ్జ, రాగి మొదలైన వంటలు పండించు కొంటున్నారు, అయినా, యకరము 1కి 14 రూపాయలవరకు శిస్తు చెల్లించవలసి వస్తోంది. చెరువు తెగిపోవుటవల్ల, 400 పశువులలో 100 పశువులు మాత్రమే నేటికి మిగిలియున్నాయి. చెరువు మరమ్మతు చేయించవలసిందని కోరుచూ రైతులు ఎస్టేటువారికి కెన్ని అర్జీలు పెట్టుకున్నా ప్రయోజనం కలగలేదు. ఎసంబ్లీ సభ్యులైన బత్తెన పెరుమాళ్ల నాయుడుగారికి కూడా గ్రామస్థులు ఎన్నిసార్లు చెప్పుకొన్నా, నిరుపయోగమైనదని అయితా తిరుమలనాధంగారు వ్రాయుచున్నారు.

* * *

## నర్సాపురం తాలూకా జమీన్ రైతు మహాసభ.

జనవరి 25 వ తేదీ మధ్యాహ్నం 3 గంటలకు పాలకొల్లులో కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారి అధ్యక్షత క్రింద నర్సాపురంతాలూకా జమీన్ రైతు మహాసభ జరిగెను. సభాధ్యక్షులు జమీందార్ల పుట్టు పూర్వోత్తరాలు, ప్రభుత్వం వారిని సృష్టించుటకుగల కారణములు, వారివల్ల ప్రజలకు కలిగే అపకారము, మొదలైన విషయాలను గురించి ఉపన్యసించిరి. ప్రకాశం కమిటీ రిపోర్టువల్ల రైతులకు కలిగే మేలులను గురించి వివరించిరి. ఆనంతరం 1805 తరువాత వచ్చిన ఈనాందారీ గ్రామాలకు కూడా యీ శాసనం అమలు జరుపవలసిందనీ; ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘంవారి సవరణలతో కమిటీ నివేదికను శాసనము చేయవలసిందనీ మదరాసు ప్రభుత్వమును కోరుచూ తీర్మానించబడెను.

* * *

## ధర్మవనం ఆక్రమణ.

మోదూరు గ్రామంలో అనాదిసిద్ధమయిన ధర్మవనం తోట ఒకటి ఉన్నది. మధ్యకాలములో ఆ గ్రామం జమీందారీ గ్రామం ఆగుటవల్ల అప్పటి జమీందారు గారు ఆ తోటకు శిస్తు వసూలు చేయబోగా, జిల్లా కలెక్టరుగారు ఆవిధంగా చేయుటకు జమీందారు గారికి హక్కు లేదని తీర్మానించారు. 1926 వ సంవత్సరపు గవర్నమెంటు సర్వేలోను, అంతకు పూర్వము సర్వేలోను, సదరు ధర్మ తోపు ఏ వాకరి స్వాధీనములో ఉన్నట్టుగా గ్రామ లెక్కలు చూపడం లేదు. ఇప్పటి వరకూ పోరంబోక ప్రక్కనే ఉన్నది. అందలి తుమ్మలు కూడా దేవాలయ ధర్మం క్రింద వినియోగించబడినవి. ఇట్టి ధర్మవనం తోటను మేదూరు గ్రామ కాపురస్తుడయిన గుళ్ళపల్లి నాగయ్య గారు స్వప్రయోజనార్థం ఆక్రమించుటకు ప్రయత్నించగా గ్రామస్థులు వుయ్యూరు జమీందారు గారికిన్నీ, కృష్ణాజిల్లా కలెక్టరుగారికిన్నీ అర్జీల ద్వారా తెలియపరచుకొన్నారు. కపిలేశ్వరపురం ఫిర్కా రివెన్యూ యినస్పెక్టరు గారు విచారణ కొరకై రాగా గ్రామస్థు లందరూ అనాదిసిద్ధమయిన ధర్మ తోపును ఎవరూ స్వాధీనపరచుకొనుటకు హక్కు లేదని సాక్ష్యం యిచ్చారు. కాని, విచారణ ఫలితం యేమయినదీ తెలియలేదు.

ఇందుపై, గ్రామకాంగ్రెసు కమిటీ శ్రీయలమంచి వెంకటకృష్ణయ్యగారి అధ్యక్షతక్రింద సమావేశమై (30—1—39). శ్రీ వుయ్యూరు జమీందారుగారు గుళ్లపల్లి నాగయ్యగారికి శిస్తు కట్టి పట్టా యిచ్చుటకు అభిప్రాయులై ఉన్నట్లునూ, అందుకై ఆయన జమీందారుగారి ఆఫీసర్లను ఆశ్రయించుచున్నట్లును, తెలియవచ్చినందున ధర్మసంస్థలు నశింపు చేయబడకుండా కాపాడవలసినదని ప్రభుత్వమును కోరుచూ తీర్మానించెను.

* * *

## రివెన్యూమంత్రిగారివద్దకు రాయభారం

నవంబరులో సంభవించిన తుపానునష్టమునకు గురియైన వ్యవసాయములకు పశ్చిమ గోదావరిజిల్లాలో రెండవపంటకు అనుమతి యిచ్చినట్లు ప్రభుత్వం ప్రకటనచేసియున్నారు. నవంబరు 24, 25 తేదీలలో ప్రతి గ్రామమందు దండోరాకూడా వేయించినారు. రైతులు పశువులను, విత్తనములను కొనుక్కొని నారుపోసి, వ్యవసాయము ప్రారంభించినారు. కాని పెర్మిషన్ యివ్వబడిన భూమిలో సుమారు 6000 యకరములు తగ్గించినట్లు డిసెంబరు 2 వ వారములో తెలియజేశారు. ఇప్పటికే చాలాభాగము సాగు అయినందున రైతులు యీ వార్తను వినగానే నిలువునా నీరై, రెవిన్యూ అధికార్ల వద్దకు వెళ్ళి మొఱ పెట్టుకున్నారు, లాభం లేకపోయినది. గొట్టుముక్కల వెంకన్న, ఎం. ఎల్. ఏ. గారి ద్వారా రివెన్యూ మంత్రి గారివద్దకు రాయభారం వెళ్లాయి. రాయభారం యొక్క ఫలితం ఏమౌనో రైతులు ఎదురు చూస్తున్నారు.

* * *

## గ్రామ మునసబు వింత చర్య.

తెనాలి తాలూకా కాంగ్రెసు సంఘ కార్యదర్శి అవుతు సుబ్బారెడ్డిగారిట్లు వ్రాయుచున్నారు:

పెదపూడి గ్రామ కాంగ్రెసు సంఘమునుండి సదరు గ్రామ మునసబు గారిచే బహిరంగంగా, టమ టమా మూలమున ప్రకటించిన కాంగ్రెసు మంత్రిగారి ఉత్తరువు విషయమై రిపోర్టు రాగా, నేనున్నూ మా సంఘ ప్రెసిడెంటు గారున్నూ 28—1—39 వ తేదీని సదరు రిపోర్టుయొక్క యదార్థతను విచారింప పెదపూడి వెళ్ళి, గ్రామస్థులను విచారించితిమి. విచారించగా, గ్రామాధికారి 10—1—39 వ తేదీలోగా శిస్తు చెల్లించనిచో పట్టా 1 కి రు. 1—0—0 చొ॥ ఎక్కువ వసూలు చేయబడుననియు, ఇది కాంగ్రెసు మంత్రి గారి ఆర్డరు అనియు టమ టమా వేయించి ప్రజలలో లేనిపోని అలజడి కలుగజేసిన సంగతి యదార్థమని రూఢి యైనది ఆ గ్రామములో కాంగ్రెసుపార్టీకన్న కాంగ్రెసేతర పార్టీ చాల బలము కలదయియున్నది. గ్రామాధికారి ననుసరించియే కాంగ్రెసేతర పార్టీ నడచుచుండును. కాంగ్రెసు యెడల అవిశ్వాసము కలుగులాగున, అధికార్ల ఉత్తరువు లేనిదే, టమటమా వేయించిన పెదపూడి గ్రామ మునసబుగారికి తెనాలి రెవిన్యూ డివిజనల్ ఆఫీసరుగారు యిట్టి కంప్లెయింట్సుకు యిక ముందు తావీయకుండా ఉండవలెనని 399/39 ఆర్డరు ద్వారా మందలించిరి.

* * *

## వ్యవసాయ కూలీ మహాసభ.

జనవరి 27 వ తేదీని నరసాపురం తాలూకా వ్యవసాయ కూలీ మహాసభ కొడమంచిలిలో శ్రీ చింతపల్లి రాజుగారి అధ్యక్షత క్రింద జరిగెను. సభకు 80 మంది ప్రతినిధులును, 2000 మంది కూలీలును వచ్చిరి. వ్యవసాయ కూలీలకు నియమిత కూలి, కాలపరిమితి గల శాసనం త్వరలో ఏర్పరచవలెననీ; యీ వర్గమునకు అన్ని సంస్థలలోను ప్రత్యేక ప్రాతినిధ్యం ఉండవలెననీ: ఉచిత నివేశన స్థలములు, నిర్బంధ విద్య, బాల బాలికలకు ఉచితభోజన—వసతి గృహములు కలుగజేయవలెననీ; జిల్లాబోర్డు కంట్రాక్టులు కూలీ సంఘములకే యిప్పించవలెననీ—మొదలైన తీర్మానములు సభలో ఏకగ్రీవంగా ఆమోదించబడెను. కొత్తగా యేర్పడిన తాలూకా కూలీ సంఘమునకు శ్రీ గుబ్బల వెంకన్నగారు అధ్యక్షులుగాను, దాసరి వెంకట్రావుగారు ఉపాధ్యక్షులుగాను, డేనియల్ స్మిత్ గారు ప్రధాన కార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి.





# కాకినాడలో 2 వేలమంది సమ్మె

కాకినాడలో స్టీవ్ డోర్ కంపెనీకి చెందిన 2 వేల మంది కార్మికులు, జనవరి 30 వ తేదీ సోమవారం నుండి సమ్మె చేస్తున్నారు.

ఇదివరలో యీ కంపెనీలో పని చేస్తున్న కార్మికుల యిబ్బందులను తొలగించ వలసినదని కాకినాడ స్టీమరు బోట్ కార్మిక సంఘం నవంబరు 16 వ తేదీని యజమానులకు తెలియజేశారు. నవంబరు 30 వ తేదీని మరొక రిమైండరు పంపారు. యజమానుల నుండి ఏమీ సమాధానం రాలేదు. అందుచే కార్మిక సంఘ జనరల్‌బాడీ సమావేశమై ఈదిగువ కోర్కెలను కోరుతూ తీర్మానించింది. 1. రోజు 1 కి 1 రూపాయి, రాత్రులందు గంట 1 కి 2 అణాలు కూలి యివ్వాలి. 2. తండేళ్లు, వాచ్‌మెన్, గ్యాంగు బోయ్సుకు రోజు 1 కి రూపాయిన్నర, రాత్రులందు గంట 1 కి 3 అణాలు కూలి యివ్వాలి. 3. ఈ కూలి, ఒడ్డు విడచినది లగాయితు తిరిగి కూలీ ఒడ్డు చేరేవరకు గల మధ్యకాలానికంతకీ ఇవ్వాలి. 4. బియ్యం కాక, ఇతర సామానులకై గ్యాంగు 1 కి రోజును రు. 1—4—0 రేషన్ ఇవ్వాలి. 5. భోజనం కోసం కూలీలకు 1 గంట విశ్రాంతి ఇవ్వాలి. 6. యూనియన్‌ను యజమానులు అంగీకరించాలి. వీటిని యజమాన్లు నెరవేర్చక పోవుటచే సమ్మె ప్రారంభ మయింది. సమ్మెను భగ్నము చేయాలని కంపెనీ యజమానులు భీమునిపట్నంనుండి 3 గ్యాంగులను తీసుకువచ్చారు. కాని వారు కూడా ఫిబ్రవరి 1 వ తేదీ నుండి సమ్మెలో చేరారు. మేస్త్రీలు కూడా సమ్మెలో చేరారు, ప్రతి దినం సమ్మెదారులు ప్రదర్శనాలు చేస్తున్నారు. కార్మిక సంఘం తరపున వలంటీరుదళం ఏర్పాటు చేయబడినది, పట్టణమందలి కార్మికు లంతా సమ్మెపట్ల అఖండమైన సానుభూతిని చూపుతున్నారు.

## బందరు

### లక్ష్మీ ప్రెస్‌లో సమ్మె విజయం.

లక్ష్మీ ప్రెస్ ప్రొప్రయిటరుగారి కుమారుడు యిటీవల ప్రెస్సులోని ఒక కుర్రవానిని తన్ని పనిలోనుండి వెళ్ళగొట్టారు, అందుపై ఆ ప్రెస్సులోని పనివారందరూ ప్రెస్ ఆఫీసులోనే ఉండి పని చేయకుండా కూచున్నారు. వెళ్ళగొట్టబడిన కుర్రవానిని పనిలో మళ్ళీ చేర్చుకొనేవరకు తామేమీ పనిచేయమని పట్టు బట్టారు. తదుపరి ప్రెస్ యజమాని ఆ కుర్రవానిని తిరిగి పనిలో చేర్చుకొనెను. ఈ సమ్మె 4½ గం॥ జరిగెను తరువాత యధావిధిగా కార్మికులు పనిచేయడం మొదలు పెట్టారు.

## తరిగొప్పుల

### రైస్ ఫ్యాక్టరీ కార్మికుల కష్టాలు.

ఫ్యాక్టరీ రూల్సు ప్రకారం టయిము ప్రకారం పని చేయించక అధికంగా యజమానులు పని చేయిస్తున్నారు, స్త్రీలకు 4 గంటల పనికి 4 అణాలు చొ॥ లెక్కలలో వ్రాస్తూ ఇచ్చేటప్పుడు వారికి రెండు అణాలు మాత్రమే ఇస్తున్నారు, కాటా కూలీలకు బస్తాకు టకకాసీ చొప్పున ఇస్తూ వీరి చేత రాత్రులందు ఫ్యాక్టరీ కాపలా కాయిస్తున్నారు. ఇందు కే విధమైన ప్రతిఫలం కార్మికుల కివ్వడంలేదు. పైగా బస్తాలలో తరుగు వచ్చిందని చెప్పి, కార్మికులపై సదరు తరుగును విధించి వారివద్దనుండి నిర్బంధంగా వసూలు చేస్తున్నారు. రాత్రి కాపలా కూలీలకు జీతాలు ఇస్తున్నామని యజమానులు ప్రభుత్వ అధికారులతో చెపుతున్నారు. సుమారు 5 సంవత్సరాల క్రితం ధాన్యం ధర 2-8-0 అయినప్పుడు తమకు లాభాలు రావడం లేదనీ ధరలు హెచ్చిన తరువాత ఎక్కువ జీతాలిస్తామనీ జీతాలు తగ్గించి, యిప్పటివరకూ యింకా జీతాలు హెచ్చు చేయనేలేదు. గుమాస్తాల యిళ్లవద్ద ఏజంట్ల యిళ్ల వద్ద కార్మికులచేత వెట్టిచాకిరి చేయించుకొంటున్నారు. 4 లేక 5 మైళ్ళ దూరాన ఉన్న గ్రామాలకుపోయి ధాన్యం కాటావేసి తెచ్చినా బస్తాకు కానీ వంతునే కూలి యిస్తూ, భత్యపు ఖర్చులేమీ ఇవ్వటంలేదు. గుమాస్తాలకు, ఫ్యాక్టరీల తాలూకు బెజవాడలోని వారి కాటా మేస్త్రీలకు, ద్రయివర్లకు సామాన్య కూలీల జీతాలలోనుండి కొంత మినహా యిస్తున్నారు. ధాన్యం "నెట్టుకట్టే" (వరుసగా బస్తాలు పేర్చుట) కూలీలకు 0-1-6 కూలీ ఇస్తారు.

ఇది సామాన్యంగా మనిషి ఎత్తుకు మించకుండా వుంటే సులువుగా పని సాగిపోతుంది. కాని ఇది

## కార్మిక సమస్యలు

10-12 వరుసలు ఎత్తు కట్టడంవల్ల పని సాగడం లేదు. ఆ కూలీల కిచ్చే 0-1-6 కూలీ గిట్టుబాటు అవడములేదు.

యీ విధంగా తరిగొప్పుల కార్మికులను మిల్లు యజమానులు చాలా ఇబ్బందులు పెట్టుతున్నారు.

## కలకత్తా

### 8,000 మంది కార్మికుల ఆర్తి

బెంగాల్ జూట్ ఆర్డినెన్సును ఎదుర్కొడానికి, కార్మిక సంఘంలో సభ్యులుగా ఉండే హక్కును నిలబెట్టుకోడానికి 30 వేల మంది టిటాఘర్ జూట్ కార్మికులు నవంబరు 14 వ తేదీ నుండి సమ్మె చేశారు. సుమారు 7 వారాలు హోరాహోరీగా వారు తమ హక్కులకై పోట్లాడారు.

ఈ పోరాటాన్ని అణచివేసేటందుకు ప్రభుత్వము, మిల్లు యజమానులు ఎన్నో దుస్తంత్రాలు సాగించారు. మత కలహాలు ప్రేరేపించారు. అరెస్టులు చేశారు. తప్పుడు ప్రచారాలు చేశారు. ఇవే కాకుండా సమ్మెను పాడుచేసేటందుకు ఇంకా ఎన్ని పద్ధతులున్నాయో అన్నీ సాగించారు. కార్మికులు వీటి నన్నిటినీ ధైర్యముతో ఎదుర్కొన్నా తాత్కాలికముగా సమ్మె విఫలమయింది.

జనవరి 2 వ తేదీ నుండి టిటాఘర్‌లోని మిల్లులన్నీ మరల పని ప్రారంభించాయి. ఈ అదును తీసుకొని మిల్లు యజమానులు కార్మికోద్యమంలో ముందడుగు వేస్తున్నవారిని 8 వేల మందిని పనిలోనుండి తొలగించివేశారు. అంతే గాదు, వారి నందరినీ వారి వారి నివాసాల నుండి లేవ గొట్టేశారు. వీరందరూ యు. పి. బీహార్, ఆంధ్ర రాష్ట్రాలకు చెందిన వారు. ఇందు 7 వేల మంది ఆంధ్రులే ఉన్నారు. వీరందరు నేటికిని తల దాచుకొనేటందుకు తావు లేక అల్లల్లాడి పోతున్నారు,

ఈ అనాథులకు సాయపడవలసిందని, కాంగ్రెసు సభాధ్యక్షుడు సుభాష్‌బోస్, పండిత జవహర్‌లాల్ నెహ్రూగార్లు పత్రికలలో ప్రకటనలు చేశారు.

ఈ కార్మికుల రక్షణకై బెంగాల్ రాష్ట్రకాంగ్రెసు సంఘం, కార్మికసంఘం చందాలు వసూలు చేస్తున్నాయి.

## కళింగపట్నం

### ఓడ రేవు కార్మికుల విజయం.

కళింగపట్నం ఓడ రేవు కార్మికుల జీతాలను యజమానులు 2-4-0 నుండి 1-12-0 కు తగ్గించుటవల్ల, అసలు తగాదా ప్రారంభమయింది. కార్మికులు తమ సంఘం ద్వారా యజమానులతో రాయబారాలు సాగించారు. కాని ప్రయోజనం లేకపోవుటచే వారు 6-12-38 తేదీని సమ్మె చేశారు. విశాఖపట్నం జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగారగు టి. కృష్ణారావుగారిని యీ విషయాన్ని విచారించడానికి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీచే నియోగింప బడ్డారు. శ్రీకాకుళం సబ్ కలెక్టరుగారైన యస్. చక్రవర్తిగారు ప్రభుత్వముచే విచారణకై నియోగింప బడ్డారు. వీరు విచారించి కార్మికులకు 1-12-9 రేటును నిర్ణయించారు. యజమానులు అందుకు అంగీకరించి 1937-38 సంవత్సరమునకు ఈ రేటు చొప్పున అవనంగా కార్మికులకు రావలసిన సొమ్మును వారికిచ్చుటకు అంగీకరించారు. అందరు కార్మికులను పనిలోకి తీసుకొనుటకుకూడ యజమానులు అంగీకరించారు. సమ్మెను కార్మికులు విరమించారు.

## మద్రాసు

### డయోసీషియన్ ప్రెస్ సమ్మె

మద్రాసు డయోసీషియన్ ప్రెస్‌లో 1938 మే 14 తేదీని 10 మంది కార్మికులను పనిలోనుండి తొలగించుటచే సమ్మెచేయగా, మద్రాసు ప్రభుత్వముచేత ఏర్పాటు చేయబడిన విచారణ కమిటీ సదరు తగాదాను పరిష్కారం చేశారు.

కాని ప్రెస్ యజమానులు ఆ నిర్ణయం ప్రకారము ప్రవర్తించుటములేదు. పనిలోనుండి తొలగించబడిన 10 మందినీ తిరిగి తీసుకోలేదు. అందులో యిద్దరు మరణించారు.

విచారణ కమిటీ నిర్ణయాలు అమలు జరుపవలసినదనియు, పనిలోనుండి వెనుక తొలగింపబడిన వారిని పనిలోకి తీసుకొనక పోయినచో కార్మికులు తగు చర్య తీసుకోనెదరని యజమానులకు ప్రెస్ వర్కర్సు యూనియన్ కార్యదర్శిగారు నోటీసిచ్చారు.

యజమానులు అంగీకరించక పోవుటచే జనవరి 31 వ తేదీనుండి ప్రెస్సు కార్మికులు సమ్మె ప్రారంభించారు, సమ్మె జయప్రదంగానే జరుగుతోంది పికెటింగు చేసినందుకు 10 మందిని అరెస్టు చేసిరి.

# కాకినాడ పడవ స్టీమరు కూలీల సమ్మె!

## 5000 మంది మగ కూలీలు 1000 మంది ఆడ కూలీల ఊరేగింపు!

కామ్రేడ్ యస్. వి. రత్నం

కాకినాడ పట్టణ పడవస్టీమరు కూలీల సంఘం 1938 వ సంవత్సరం అక్టోబరు నెలలో యేర్పడింది. యీ కూలీలు ఓడమీద ఎగుమతులు, దిగుమతులు చేస్తారు. ఆ పనిలో యెక్కువ అపాయకరం అవడంచేత, చాలా మంది ప్రాణాలు పోగొట్టుకున్నారు. అనేకమంది కాళ్లూ, చేతులూ విరగగొట్టుకున్నారు. వీళ్ళకి మధ్యవాళ్లుగా పని చేస్తుంటే స్టీవడోరు కంపెనీలు నష్టపరిహారం యివ్వటంలేదు. సంగదా వీళ్లకి న్యాయంగా వచ్చే కూలి యివ్వకుండా కూలిని దోచుకుంటున్నారు. యీ స్టీవడోరు కంపెనీలు ఒక్కొక్క కూలీకి సగటున రు 1 లు యిస్తూంటే మధ్యవాళ్లుగా వుంటూన్న యీ కంపెనీలు కూలీకి రు 0-8-6 మాత్రమే యిస్తూ మిగతా డబ్బంతా అపహరిస్తోంది. యిలాంటి పరిస్థితుల్లో కూలీలంతాకలసి వొక సంఘన్ని యేర్పాటుచేసుకొని వాళ్ల సాధారణ సమావేశములో యీ దిగువ తీర్మానాలుచేసి స్టీవడోరు కంపెనీలు కందిచ్చి వాళ్ల కోర్కెలు. కష్టాలు, తీర్చమని 1938 నవంబరు 16 వ తేదీని కోరింది.

కోరికలూ, కష్టాలు తెలియచేసే తీర్మానం

1. పగలు రు 0-8-6, రాత్రి 0-12-0 చొ॥ యిప్పుడిస్తూండే కూలి కష్టానికి చాలదు కాబట్టి పగలు 1-0-0 చొప్పున రాత్రి 2-0-0 చొప్పున కూలియివ్వాలి.

2. కూలీల కూలినుండి స్టీవడోరు కంపెనీల ఏజంట్లు, మేస్త్రీలు రు 1 లు దాకా అపహరిస్తున్నారు. కాబట్టి యీ పద్ధతి వెంటనే రద్దు చేయాలి.

3. ఓడమీదకి కూలీలని తీసుకు వెళ్ళేటప్పుడు, తీసుకువచ్చేటప్పుడు "స్టీమ్" లాంచి మీదే గాని యిప్పటిలాగ తీసుక వెళ్ళేటప్పుడు లాంచీ, తీసుకువచ్చేటప్పుడు బోటుమీద, జరగకూడదు.

4. తిండి సౌకర్యం యిప్పుడు సరిగ్గాలేదు. స్టీవడోరు కంపెనీలు భోజనాలకిచ్చే సామాగ్రిని కొంత మేస్త్రీలు అపహరిస్తున్నారు. యిల్లాంటి అన్యాయాలు జరగకుండా జాగ్రత్తా కూలీలకి సరి అయిన ఆహారాన్ని ఓడలో త్రాగే నీటిసదుపాయాన్ని కలగచేయాలి.

తరువాత :-

స్టీవడోరు కంపెనీలనుండి యెల్లాంటి జవాబు రాలేదు. పలసార్లు రిమైండు చేసింది. యిక లాభంలేకపోయింది. కూలీలు కష్టాలను వోర్వ లేకపోయారు. చివరికి యూనియన్ జనవరి 30 వ తేదీని సమావేశమై యీదిగువ తీర్మానంచేసి, యీతీర్మానానికి జవాబివ్వకపోతే, సమ్మెని ఆరంభిస్తామని తెలియజేసింది.

తీర్మానం

1. ప్రతి కూలీకి పగలు 1-0-0 చొప్పునా, రాత్రి గంటకు 0-2-0 లు చొ॥ యియ్యాలి తండేళ్ళకి, వాచ్‌మెన్లకి, గేంగు బోయిస్‌కి. పగలు 1-8-0 రాత్రి గంటకి 0-3-0 లు చొ॥ ఒకొక్కరికి యివ్వాలి.

2. దరి వొదలిపెట్టిన దగ్గరనుండీ తిరిగి మళ్లీ దరి చేరేవరకూ అయ్యే కాలానికి ప్రతి కూలీకి, కూలి యియ్యాలి.

3. ప్రతి గాంగుకి 20 కంటె తక్కువ కూలీ లుండకూడదు.

4. ప్రతి కూలి గేంగుకి తిండి కొనేటప్పుడు అది 1-4-0 కి తగ్గి ఉండకూడదు. అది బియ్యపు ఖర్చు కాకుండానే. వొకవేళ వోడ మీదనే సదుపాయం చేసేటట్టయితే, దానివిలువ యింతకి సరిపోయే ఉండాలి.

5. భోజనానికి ఒకగంట విశ్రాంతి ఇయ్యాలి

6. యూనియన్ని గుర్తించాలి.

జవాబుకోసం ఆవేళల్లా యూనియన్ చూసింది కంపెనీ యజమానులు యూనియన్ తీర్మానాల్ని. కోర్కెల్ని. నిర్లక్ష్యం చేయడంచేత, 31 వ తారీఖున యూనియన్ సమ్మెకి ఆర్డరు ఇచ్చింది.

సమ్మె!

సమ్మెని చెడగొట్టడానికి కంపెనీ చాలా కుష్ట ప్రయత్నాలు చేసింది. సారాబుడ్లు పేటల్లోకి పంపించింది. కూలీల్ని చెదరగొట్టాలని నీచపు ప్రయత్నాలు చేసింది. కాని కూలీలు మోసానికి లొంగలేదు. భ్రమల్లో పడలేదు. ప్రతి పేటకి ఒకొక్క సమ్మెకమిటీ యేర్పడి మొత్తం 20 పేటల్లో 20 సమ్మె కమిటీలు యేర్పడినాయి. 100 మంది వాలంటీర్లు దళం యేర్పడింది. మొదటి రోజున 2000 మంది సమ్మెలోచేరారు. తండేళ్లు మేస్త్రీలు సమ్మెలో చేరారు, 31 వ తేదీ ఉదయాన్న బ్రహ్మాండమైన ఊరేగింపు 2000 మంది కూలీలు. కాకినాడ పట్టణ కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకత్వాన్న జరిగింది. ఎర్రజండాలతో యింత మందీ, సముద్ర కెరటాల్లాగ నడుస్తూ "హెచ్చు కూలీ కావాలి" "ఆకలి మంటలు తీరాలి" "సమ్మెలో చేరాలి" అని నినాదం మారుమ్రోగిస్తూంటే, కాకినాడ నగరం అంతా, అట్టుడికినట్టు ఉడికింది. చైతన్యంతో ఊగింది. పట్టణంలోని అన్నిశాఖల కూలీలు "సమ్మె జరపండి! జయిస్తారు" అని హెచ్చరించారు. పట్టణంలోని, ప్రతి కూలీపేటకి ఊరేగింపు సాగింది. మూలమూలలా మీటింగులుపెట్టారు. కామ్రేడ్సు కృష్ణారావు, కోరపాటి, రత్నం, వెంకటేశ్వరరావు, వీరయ్య, ప్రతి మీటింగులోనూ, ఉద్బోధించారు. రాత్రి పగలూ, నిద్రాహారాలు లేకుండా వాలంటీర్లు ప్రతి రేవుదగ్గరా ప్రతి పల్లెదగ్గరా, వెయ్యికళ్ళతో కాపలకాస్తూ కనిపెట్టారు, మరచటిదినాన్ని సమ్మె యింకా యెక్కువ బలపడింది. యింకో 1000 మగ కూలీలు 800 ఆడకూలీలు సమ్మెలోచేరి ఊరేగింపులోకి వచ్చారు. యిచ్చట ఒక్క కూలీ కూడా కంపెనీ మోసానికి లొంగలేదు. దాంతోటి కంపెనీలు అన్నీ యేకమయాయి. యూనియన్ కరపత్రాలద్వారా, కంపెనీ దగా స్వభావాన్ని మోసాన్ని తెలియజేసింది.

స్టీవడోరు కంపెనీల నీచపు పనులు.

సమ్మె యింత క్రమశిక్షతో, యింత బలముతో సాగుతూందని కంపెనీవాళ్లు తలచలేదు. వాళ్ల ప్రయత్నాలన్నీ పరాజయం పొందడంతోటే, దొడ్డిదారి పనులకి ఆరంభించారు. "లరీవి" కంపెనీ భీమునిపట్నం నుంచి కూలీల్ని తెప్పించడానికి పోనుచేసింది. యూనియన్ వెంటనే విశాఖపట్నం హార్బరు పని వాళ్ళ యూనియన్‌కి యిక్కడ సమ్మె జరుగుతోందనిన్నీ, కంపెనీ కూలీల్ని, భీమునిపట్టణం తెప్పిస్తూందని, అవు చేయవలసిందని టెలిగ్రాం యిచ్చింది. కాని భీమునిపట్టణం కూలీలకి యీ సంగతి అందక పూర్వమే వచ్చేసారు ఓడ మీదికి. వెంటనే యింకో కరపత్రం ప్రకటిస్తూ, ఒడమీదికి యూనియన్ యిద్దరు వాలంటీర్లని కంపెనీపెట్టే అన్ని ఆటంకాల్ని దాటుకుని పంపింది. భీముని పట్టణపు కూలీలు తమకీ సంగతి తెలియదని, తెలియక వచ్చేమని యిక రామని చెప్పారు. 2 వ తారీఖున లరీవు కంపెనీ ఓడమీంచి ఆ కూలీల్ని తెప్పించి కంపెనీ గుట్టపుశాలలో దాచటానికి ప్రయత్నంచేసింది.

కంపెనీలకి పోలీసు సహాయం

1 వ తారీఖున సమ్మె ఊరేగింపు 6000 మంది మగ ఆడకూలీలతో లేచర్ల పేట, చెంకిపేటనుంచి ఆరంభించి, మెయిన్‌రోడ్డు మీంచి, యేటివారమీదుగా సాగి రేవుదగ్గర, ఒకమైలు పొడవుని, బారులుతీర్చి కూర్చున్నారు. భీమునిపట్టణం కూలీ సోదరులికి, తమ అణిగిపోయిన పొట్టల్ని చూపెట్టడానికి. కంపెనీ యజమానులు పోలీసు సహాయంతో వీళ్ళని బెదిరించాలని గట్టిప్రయుత్నించేసారు లాభంలేదని, భీముని పట్టణ కూలీల్ని యింకో రోవులో కంపెనీ దగ్గరగా, దింపించింది. కలక్టరుగారు, డిప్యూటి సూపరెంటెంటు లేబరు తహస్సీలుదారు వాళ్ళు వచ్చి, భీమునిపట్టణం వారితో, దూరంగా, ఉండి యేమేనా చెప్పుకో మన్నారు. అంతే....వాళ్ళని తీసుకువెళ్ళి కంపెనీ గుట్టపు సాలల్లో దాచింది. చుట్టూ పోలీసు ఘాటు కావలాపెట్టింది. లరీవు కంపెనీ దగ్గర, కూలీలంతా, గొప్ప ప్రదర్శనాన్ని జరిపారు. బయిటినుండి "కూడు పడగొట్టకండి" "కేవునిస్తాం వెళ్ళిపోండి" అని మొరపెట్టారు. మర్నాడు, మళ్ళీ యింకో కంపెనీకి. కూలీల్ని సప్లయి చేయుడానికి, యీ దాచిన కూలీల్ని పంపుతోంది లరీవు కంపినీ. కలెక్టరుగారు, కంపెనీలతో, రాయబారం చేసుకోమని యూనియను ప్రతినిధులికి సలహా యిచ్చారు. గొప్ప పట్టుదలతో ఉత్సాహంతో 6000 మంది కూలీలు, తిరిగి ప్రదర్శనం జరిపారు లరీవు కంపెనీ, దగ్గర ఆడ కూలీలు కడుపులు చూపెడుచూ, అన్నం పెట్టండి అని మొరపెట్టారు. తల్లుల చంకల్లోని పిల్లలు, ఆకలితో మాడుతూ గోలుపెట్టి యేడిచారు. కంపెనీ వాళ్ళు 144 సెక్షను ఆర్డరిమ్మని కలక్టరుగారిని అడిగించారు. కాని సమ్మె శాంతంగా సాగుతోంది. అవసరం లేదని జవాబిచ్చాడు. భీమునిపట్టణం కూలీలు పోతుంటే శాంతంగా పికెట్ చేసుకునేందుకు కలెక్టరు అనుజ్ఞయిచ్చారు. కాని యిటు పోలీసుఘాటు, అటు పోలీసుఘాటు మధ్యను సగం చచ్చిపోయి, దిగాలుగా మొగాలువేసుకుని, ఒకళ్లనొకళ్ల నంటిపెట్టుకుంటూ పడవలోకి పోతున్న భీమునిపట్టణం కూలీలు పోలీసు భయంచేత వీళ్లమాటలు వినలేకపోయారు. 6000 వేలమంది ఒక్కమారున నిలబడి, చేతులెత్తి దండాలు పెడుతూంటే, స్త్రీలు అంతా "కూడుపెట్టండి! సమ్మెచేయండి" అని మొరపెడుతూంటే, చంకలోని చంటిబిడ్డలు ఎండకి మాడిపోతూ, గొల్లున ఏడుస్తూంటే నరహృదయాలన్ని నిలువునా నీరయాయి కాని కంపెని హృదయాలు మట్టుకి పాషాణాలయాయి. పడవ పోతూంటే, వెనకాల పరుగెట్టుకుంటూ స్త్రీలు. విడిపోయిన కొప్పులుతో, "కూడు పడగొట్టకండి" అని దరినించి అరుస్తూంటే, పోలీసు తుపాకితో కాలుస్తామని బెదరించాడు. రాత్రింబగళ్ళు యీపోలీసులు, గుట్టపుశాల్లో దాచిన కూలీలకి, కంపెనీకి, పారా యిస్తున్నారు.

రాయ్ చటర్జీ కంపెనీ వొప్పందల

బ్రహ్మాండంగా ఊరేగింపులు సాగిస్తూ, కూలీప్రజల్లో పట్టుదలను ప్రేరేపిస్తూనే సమ్మె కమిటీలు వాలంటీర్లు విధివిరామం లేకుండా రాత్రింబగళ్ళు నిద్రాహారాలు లేకుండా, పనిచేస్తుంటే వొక్క కంపెనీకి కూడా వొక్క కూలీ అయిపోవటం లేదు. రాయ్ ఛటర్జీ కంపెనీ, సారాసీసాలతో తిరిగినా కూలీలు దొరక్కపోవడంచేత రెండవ తేదీ రాత్రి రెండుగంటలకి యూనియనుకి కబురుచేసింది పగలు 0-12-0లు రాత్రి 1-0-0 యిస్తానని. కాని యూనియన్ అంగీకరించక పట్టుదలతో ఉండడంచేత నిన్న యూనియన్ షరతుల కన్నింటికీ అంగీకరిస్తున్నానని రాయ్ చటర్జీ కంపెనీ బ్రాంచిమేనేజరు వ్రాతమూలకంగా కలెక్టరుగారి సమక్షంలో ఒప్పుకున్నారు. లరీవు కంపెనీ, యితర యూరపియన్ ఏజంటులు, రాయ్ చటర్జీని ఆ వొప్పుదల నిరాకరించమని చెప్పారు. కాని అప్పటికప్పుడే యూనియన్ కూలీలు పడవలో యెక్కి యూనియన్ షరతులప్రకారం కూలియిస్తేగాని దిగమని భీష్మించుకు కూర్చోడంచేత రాయ్ చటర్జీకంపెనీ యింకోలాగ చెయ్యలేకపోయింది అందుచేత తాను ఆర్డరిచ్చి తెప్పించిన విశాఖపట్నపు కూలీలను పంపించివేసింది. రాయ్ చటర్జీ కంపెనీ ఒక్కదానిమీదే సమ్మె ఎత్తివేయబడింది. యితర కంపెనీలమీద సమ్మె సాగుతుంది.

ఇతర శాఖల కూలీల సానుభూతి.

పడవకూలీలు, వేరుకూలీలు, మూటకూలీలు యింకా ఇతర పీడితవర్గమూ, అంతా యెంతో సానుభూతి చూపెడుతోంది. అంతాకూడా కంపెనీలు లొంగకపోతే సమ్మెలో తాము కూడా చేరుతామని చెప్పారు.

విశాఖపట్నం హార్బరు యూనియన్ కూడా అక్కడ బ్రహ్మాండముగా ప్రచారము సాగిస్తూ కూలీలని కాకినాడ రానివ్వకుండా ప్రయత్నము చేస్తోంది.

శాంతంగా సమ్మె యింకా సాగుతోంది.





నోటీసు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహక వర్గము ఫిబ్రవరి 16 తారీఖు మధ్యాహ్నము 2 గంటలకు పార్టీ ఆఫీసులో సమావేశమగును. సభ్యులందరు ఉదయము 8 గంటలకే హాజరుకావలసినదిగా కోరుచున్నాను.

చర్చనీయాంశములు :—

1. వేసంగిపాఠశాలలు
2. సాంవత్సరిక పార్టీ సమావేశము
3. నవశక్తి రిపోర్టు
4. పార్టీ ఆర్థికస్థితి
5. పార్టీ నిర్మాణము
6. వివిధ సంఘాలలో పార్టీ ఇంతవరకు చేసిన కృషి.
7. రాబోవు త్రిపురి కాంగ్రెసు సమావేశము-దేశములోని విషమ పరిస్థితి.-మనకార్యక్రమము.

పుచ్చలపల్లి సుందరయ్య,
కార్యదర్శి

★

గుంటూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గ సమావేశము.

గుంటూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహకవర్గ సమావేశము యీ నెల 12 వ తేదీన తెనాలిలో పార్టీ ఆఫీసునందు ఉదయం 9 గంటలకు జరుగును. గాన కార్యనిర్వాహక సభ్యులందరు హాజరుకావలయును. ఈసమావేశములో రాబోవు జిల్లా కాంగ్రెసు కమిటీ ఎన్నికలు, ఫెడరేషన్ ప్రతికూల ప్రచారము, జమిందారీ రైతు శాసనాన్ని గురించిన ఆందోళన, కార్మిక రైతు సమస్యలు మొదలగు విషయములు చర్చించబడును.

తెనాలి, 4-1-39. } పో. నరసింహమూర్తి, కార్యదర్శి, జిల్లా కాం॥ సో॥ పార్టీ.

★

సంయుక్త సమావేశము.

రాబోవు జిల్లా కాంగ్రెసు కమిటీ యెన్నికల విషయాన్ని, ఫెడరేషన్ ప్రతికూలప్రచారాన్ని జమీందారి రైతుశాసనం సంబంధమైన ఆందోళనాన్ని చర్చించటానికిగాను సోషలిస్టుపార్టీ, కిసాన్, కార్మిక, కాంగ్రెసు వర్కర్లయొక్క సంయుక్త సమావేశము యీనెల 12 వ తేదీన తెనాలిలో పార్టీ ఆఫీసునందు మధ్యాం 2 గంటలకు ప్రారంభమగును. గాన పై పేర్కొనబడిన వివిధ రంగాలలో పనిచేయుచున్న వర్కర్లు మాత్రమే, ఆహ్వానింపబడినవారే హాజరుకాప్రార్థితులు.

తెనాలి, 4-2-37. } పో. నరసింహమూర్తి, కార్యదర్శి, జిల్లా కా॥ సో॥ పార్టీ.

★

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘాధ్యక్షుని విజ్ఞప్తి

"అఖిలభారత రైతు సంఘమువారిని చాల మంది రైతు సేవకులు అనేకచోట్లనుండి రైతు సంఘ సభ్యులను చేర్పించుటకు టైము పొడిగించవలసినదిగా కోరిరి. అందువలన అఖిల భారత రైతుసంఘ ప్రధాన కార్యదర్శిగారగు ప్రొఫెసర్. యన్. జి. రంగాగారు ఫిబ్రవరి 15 వ తేదీవరకు రైతుసంఘాలలో సభ్యులను చేర్పించుటకు అవకాశమొసంగిరి. కాన రైతు సేవకులు గ్రామ, తాలూకా, జిల్లా రైతుసంఘములన్నియు హెచ్చు శ్రద్ధతీసుకొని రైతుసంఘములలో సభ్యులను చేర్పించవలసినదిగా హెచ్చరించుచున్నాను. రైతులెల్లరు రైతు సంఘములోచేరి, దానిద్వారా తమ దైనందిన కష్టముల నీడేర్చుకొనుటకు కృషిచేయవలసినదిగా కోరుచున్నాను."

బెజవాడ, 4-2-39. } ఇట్లు, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి
అధ్యక్షుడు, ఆం॥ రా॥ రైతుసంఘం.

★

మునగాల ఎస్టేటు యువజనసంఘ స్థాపన
శిరిపురము.

మునగాల ఎస్టేటులో 40 గ్రామాలు గలవు. శిరిపురం గ్రామములో యువజనసంఘ ఆఫీసుకు తాడూరి జనార్దనాచారిగారు వుచితముగా తమ భవనమును యిచ్చినారు. 27-1-39 తేదీన జమీన్‌రైతు సంఘ ప్రశిడెంటు నల్లపాటి వెంకట్రామ నర్సయ్యగారి ఆధ్వర్యమున పతాకము (ఎర్రజెండా) నెగురవేయ బడింది. అసంఖ్యాకులయినప్రజలతోను,తాళమేళములతోను,బ్యాండు వాయిద్యములతోను, డప్పులతోను యువకులు జయజయ ధ్వానములతోను మిన్నుముట్టగా జయప్రదముగా వూరేగింపును జరపిరి. యువజన సంఘము స్థాపించబడినది.

ఫేమస్ ఫిలిమ్సు వారి తిరపతి వేంకటేశ్వర మహాత్యములోని ఒక దృశ్యము.

యువకులందరు శిరిపురం గ్రామ కాపరస్తుడు చల్లా రామయ్యగారిని యువజన సంఘ ప్రెశిడెంటుగాను, కరివిరాల కాపరస్తుడు ఘట్టు గోపయ్యగారిని సెక్రటరీగాను, నడిగూడెం కాపరస్తుడు అక్కిరాజు మాధవరావుగారిని వైస్ ప్రశిడెంటుగాను, రేపాల కాపరస్తుడు చిట్టాల గోపిరెడ్డిగారిని సహాయ కార్యదర్శిగాను యింకా 11 మందిని వర్కింగు కమిటి సభ్యులుగాను ఎన్నుకున్నారు. నల్లపాటి వెంకట్రామ నర్సయ్యగారిని సభాధ్యక్షునిగా ఎన్నుకొనిరి.

ఇట్లు,
వెలిదండ నరసింహారావు,
మునగాల ఎస్టేటు యువజన సంఘ సభ్యుడు.

★

నోటీసు

ఉత్తర విశాఖజిల్లా రైతుంఘ సభ టెక్కలిలో తే॥ 15-2-39 బుధవారం.

యీదిగువ ముఖ్య విషయాలు చర్చించుటకై సభ తే॥ 15-2-39 బుధవారం ఉదయము 10 గంటలకు టెక్కలి రహదారి బంగాళాలో సమావేశ మగుటకు నిర్ణయించడ మైనది గాన సభ్యులెల్లరు తప్పక దయచేయ ప్రార్థితులు.

విషయములు

1. శ్రీ ప్రకాశం కమిటీవారి రిపోర్టు పై శాసనసభవారు గావించిన తీర్మానము.

2. ఆంధ్రరాష్ట్ర రైతు సంఘమువారి సర్క్యులర్ ప్రకారం అఖిలభారత కిసాను మహాసభకు ప్రతినిధులను యెన్నుకొనుటకు జిల్లా సంఘ సభ్యులను యెన్నుకొనుటకును. నియోజక వర్గాలు యెన్నుకోద్యోగులు మున్నగు యెన్నిక యేర్పాటులు నిర్ణయించుట

3 వచ్చే వేసంగిలో రైతాంగ విద్యాలయము సాగించుటకై స్థలము కాలము ఆలోచించుట

4. జమాఖర్చులు పరిశీలించుట

5. సభ్యుల ప్రవేశపెట్టు యితర విషయాలు.

బారువ తే॥ 8-2-39 } గౌతు లచ్చన్న
కార్యదర్శి

ప్రథమ ఉత్తర విశాఖమండల
ఇనాం అగ్రహారీ రైతుల అత్యవసర
మహాసభ

టెక్కలిలో 15-2-39 తేదీ బుధవారం శ్రీభాస్కరరావు పట్నాయకుగారు ఎం.ఎల్.ఏ. గారు అధ్యక్షులు, పాలకొండ.

జమీందారీ విచారణ కమిటీ రిపోర్టులో యీనాం రైతులకు చాల అన్యాయం జరిగింది. కొన్ని యీనాములను "మినహాయింపబడిన యీనాములు (execluded Inams)" పర్మనెంటు సెటిల్‌మెంటులో చేరియున్న "యెస్టేటు యినాములు (Included Inams)" యని కొన్ని, మరికొన్ని సెటల్‌మెంటు పిమ్మట వచ్చినవి "దరిమిలా యీనాములు (Post Settlement Inams)" యనియు, మూడు విభాగులుగా భాగించి రైతులయొక్క హక్కులకు భంగం కలిగింప బడునేమో యన్న అనుమానానికి అవకాశ మిచ్చుచున్నది. ఈతరుణములో యీనాం రైతులు వెంటనే మేల్కొని తమ హక్కులకై పోరాడాలి. ప్రభుత్వానికి శాసన సభ్యులకు తమ కోర్కెలు విస్పష్టముగా తెలుపుకోవాలి.

అందుచే ఉ॥ విశాఖజిల్లా రైతు సంఘము వారి యాజమాన్యమున అత్యవసరముగా పై మహాసభ యేర్పాటు చేయడమైనది. గాన యీనాం, అగ్రహారీ, మొఖాసా రైతులు వేనకువేలుగా దయచేసి సభ జయప్రదముగా జరుపగోరుచున్నాము. రైతు శ్రేయోభిలాషులగు పెద్దలు ప్రచారకులుగూడ తప్పక దయచేయ ప్రార్థన.

బారువ, 3-2-39. } ఇట్లు విన్నవించు భవద్విధేయుడు
గౌతు లచ్చన్న
ఉ॥ వి॥ జిల్లా రైతుసంఘ కార్యదర్శి.

సభా కార్యక్రమము

15—2—39 బుధవారం

మధ్యా. 12 గం॥లకు అధ్యక్షుని ఊరేగింపు.
" 1 గం॥కు పతాక వందనోత్సవం
సాయం. 2 గం॥లకు మహాసభ ప్రారంభ
ఉపన్యాసాలు, తీర్మానాలు.

★

విశాఖపట్నం జిల్లారైతుసంఘము
నోటీసు.

తే 31-1-39 న ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ తీర్మానము సర్క్యులర్లు ప్రకారం యీ క్రింద కనుబరచిన తేదీలలో జిల్లారైతుసంఘ కార్యనిర్వాహకవర్గ సమావేశములు జరుపబడును. గాన అత్యవసరమైన యీ సమావేశములకు కార్యనిర్వాహకవర్గ సభ్యులెల్లరు తప్పక విచ్చేయ ప్రార్థన.

కార్యక్రమము

1. తే 9—2—39 ఉదయం 10 గంటలకు పాలకొండలో తాలూకా కాంగ్రెసు [illegible] కార్యాలయమున ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ తీర్మానమునకనుసరించి జిల్లారైతుసంఘ వ్యవహారము పరిశీలించి తత్‌వ్యవహారములను సరిచేయుటకు గాను జిల్లా కార్యనిర్వాహకవర్గ సమావేశము జరుగును.

2. 16-2-39 తేదీని ఉదయం 10 గంటలకు తెర్లాంలో జిల్లా రైతుసంఘ కార్యాలయమున రాష్ట్ర జిల్లా సంఘ సభ్యుల ఎన్నిక ఏర్పాటులు నియోజక వర్గములు నిర్ణయించుట మున్నగు ముఖ్యవిషయములు చర్చించుటకు గాను జిల్లా కార్యనిర్వాహకవర్గ సమావేశము జరుగును.

ఇట్లు,
కార్యాలయం, తెర్లాం, బొబ్బిలితాలూకా } యన్. నరసింహమూర్తి, ప్రధాన కార్యదర్శి 2-2-39

★

తూ. గో. జిల్లా వ్యవసాయకూలీ సంఘం

పై సంఘముయొక్క కార్యనిర్వాహకవర్గం జనవరి 29 వ తేదీని రాజోలుతాలూకా టేకిశెట్టిపాలెం కామ్రేడ్ పి. అనంతంగారి అధ్యక్షక్రింద సమావేశమై, ప్రకాశంకమిటీ నివేదికను రాష్ట్ర రైతు సంఘంవారి సూచనలను బలపరచుచూ; రెండవ జిల్లా వ్యవసాయకూలీ మహాసభ అమలాపురంతాలూకాలో జరుపుటకు; ప్రాథమిక సభ్యులను ఏప్రిల్ నెలాఖరులోగా చేర్పించుటకు సంఘ కార్యాలయం మునికపల్లిలో ఉంచుటకు; కామ్రేడ్ నంబూరు శ్రీనివాసరావుగారి ఆధిపత్యమున ఫిబ్రవరి 15 వ తేదీనుండి కూలీ రక్షణ యాత్రను ప్రారంభించుటకు తీర్మానించబడెను. జిల్లా ఆదిమాంధ్ర సంఘాధ్యక్షులైన పాము రామమూర్తిగారి కులతత్వ ప్రచారమును, కూలీ సంఘముపేర రెండణాలచొప్పున చేసేవసూళ్లను గర్హించుచూ తీర్మానించబడెను. జిల్లా సోషలిస్టు పార్టీవారిచే సూచింపబడిన కనీసపు దాళ్ల వ్యవసాయకూలీల కనీసపు కోర్కెల ననుసరించి మదరాసు ప్రభుత్వం త్వరలో "టెనెన్సీ" బిల్లును కూలీ నిర్ణయబిల్లును ప్రవేశపెట్టవలెననికోరుచూ మరొక తీర్మానం ఆమోదించబడెను.

# ఒరిస్సాలో మరల ప్రతిష్టంభనమా?

ఒరిస్సా సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వానికై ప్రజలు ఆందోళన చేస్తూంటే దానిని అణచివేయడానికి బ్రిటిషు సేనలు కూడా సంస్థానాధీశులకు సప్లయి చేయబడ్డాయి. ఢెంకనాల్‌లో 7 పర్యాయాలు ప్రజలపై కాల్పులు జరిగాయి. మిగిలిన హింసాకాండ అంతా నవశక్తి పాఠకులకు విదితమే. 70 వేలమంది జనాభాగల టాల్చేరు సంస్థానంలో 31,313 మంది ప్రజలు సంస్థానాధికారుల బాధలు పడలేక బ్రిటిషు ఒరిస్సాలోకి లేచివచ్చి కూడూ గుడ్డా లేకపోయినా సరే సహించుచున్నారుగాని సంస్థానంలోకి వెళ్ళ నిరాకరించారు. రాంపూర్ సంస్థానంలో బజల్‌గెట్టి ప్రజలను హింసకు రెచ్చగొట్టి ప్రజల తిరుగుబాటు వాతబడ్డారు. కియోంజార్ సంస్థానం సరిహద్దు వెలుపల జరిగే రైతు సభలకు సహితం సంస్థానంలో నుండి ప్రజలు పోకుండా ఆపుటకు అనేక ప్రయత్నాలు చేశారు. తుదకు ఆ సభలపైనే నిషేధాజ్ఞలు కూడా జారీ చేయించారు.

తుదకు కలకత్తా నుండి సేనలను దిగుమతి చేసి కటక్‌లో మకాంపెట్టారు. సంస్థాన రక్షక చట్టంలోని 1, 3 సెక్షనులను ఒరిస్సా సంస్థానంలో అమలు జరిపించి సంస్థాన ప్రజల పోరాటాలను గురించి ఒరిస్సా రాష్ట్రంలో పత్రికలలో ప్రచురణ కాకుండేటట్లు నిషేధించారు.

కాని సంస్థాన ప్రజల ఆందోళనను బ్రిటిష్ ప్రభుత్వం, సంస్థానాధిపతులు అణచలేకపోయారు.

సంస్థానాలలో జరిగిన కాల్పులను గురించి, ప్రజల యిబ్బందులను గురించి నిష్పాక్షికమైన విచారణ జరగాలని బట్లరు కమిటీ సూచించింది ఇంతవరకూ ఒరిస్సా సంస్థానాలలో జరిగిన కాల్పుల విషయమై ఇంతవరకు ఏవిధమైన విచారణకూడ ఏర్పాటు చేయబడనేలేదు.

ఒరిస్సా సంస్థానాలలోని యీ అశాంతిని ఎదుర్కొనే విషయంలో ఒరిస్సా గవర్నరుకు మంత్రులకు తీవ్రమయిన అభిప్రాయ భేదాలు కలిగాయి.

## రాజకీయ ఖైదీల సమస్య

సంస్థానాలలో గావించిన నేరాలకై అరెస్టు చేయబడి బ్రిటిష్ ఒరిస్సా జైళ్లలో నున్న రాజకీయ ఖైదీలను ఆయా సంస్థానాలకు అప్పగించవలసినదని సంస్థాన ప్రభుత్వాలు ఒరిస్సా మంత్రివర్గాన్ని కోరాయి. ప్రస్తుతం అటువంటివి 60 వారంట్లున్నాయి. ఆయా ఖైదీలకేసులను విడివిడిగా పరిశీలించి. సంస్థాన ప్రభుత్వాలకి అప్పగించడం అన్యాయం అని తమకి తోచిన ఖైదీనల్లా విడుదల చేసింది ఒరిస్సా మంత్రివర్గం. సంస్థానాలలో ఎక్కడాకూడా తమకుగాని ప్రజలకుగాని నమ్మకం గల న్యాయ పరిపాలన లేనేలేదని, అందుచే రాజకీయఖైదీలకేమీ న్యాయం జరుగదని ఒరిస్సా ప్రధాని ప్రకటన చేశాడు. రాజకీయ ఖైదీలు హింసచేయడంగాని, దానికి పురిగొల్పడంగాని సాగించి ఉంటే వారిని సంస్థాన ప్రభుత్వాలకు అప్పగించడానికి మంత్రివర్గం అంగీకరించింది.

కాని గవర్నరిందుకు వ్యతిరేకించాడు. ఏ అభ్యంతరంకూడ చెప్పకుండా, ఏమీ విచక్షణ చేయకుండా రాజకీయ ఖైదీలనందరినీ సంస్థాన ప్రభుత్వాలకు అప్పగించాలని కోరాడు. ఈ ఖైదీలను అప్పగించుట న్యాయమో, అన్యాయమో తగు విచారణ జరిపి తీర్పు చెప్పడానికి ఒక న్యాయాధికారిని నియమించవలసినదని మంత్రివర్గం కోరింది. అందుకుకూడా గవర్నరు నిరాకరించాడు.

## స్టేట్సు ప్రొటెక్షన్ ఆక్టు.

ఒరిస్సా సంస్థానాలలోని ఆందోళనను అణచివేయడానికి ఒరిస్సా రాష్ట్ర మంతటా స్టేట్సు ప్రొటెక్షన్ ఆక్టుయొక్క అన్ని సెక్షన్లు ప్రయోగించవలసినదని బ్రిటిషు ప్రభుత్వం మంత్రివర్గాన్ని కోరింది. మంత్రులందుకు నిరాకరిస్తూ ప్రస్తుతం అమలులో నున్న 1,3 సెక్షన్లు కూడా రద్దుచేయవలసిందని కోరారు.

ఈ తగాదాలో బ్రిటిషు ప్రభుత్వం లొంగక పోయినట్లయితే త్వరలోనే తీవ్రమయిన రాజకీయ విషమస్థితి సంభవించవచ్చును.





# నవశక్తి

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధ సంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

బర్మా రేట్లు

| | |
|---|---|
| సంవత్సర చందా | రు 5—0—0 |
| విడి ప్రతి | 0—1—6 |

## ప్రకటన రేట్లు

"కాలం" వెడల్పు 2" (2 అంగుళాలు)

| | |
|---|---|
| నెలకు 20 అం॥ లోపల అంగుళానికి | రూ. 0—6—0 |
| ,, 20" అం॥ పైన ,, | 0—4—0 |
| ,, 100" అం॥ పైన ,, | 0—3—0 |
| పేజీ | రు 10—0—0 లు |
| ½ పేజీ | 6—0—0 లు |
| ¼ పేజీ | 3—0—0 లు |

షరా:—ఈ రేట్లుపైన కమిషన్‌లు. డిస్కౌంటులు ఇవ్వబడవు. రు 0—8—0 లకు తక్కువ ప్రకటనలు తీసుకొనబడవు. నెలకగు డబ్బు ముందుగా ఇవ్వవలెను.

ప్రత్యేక చోటునకు, ప్రత్యేక రేట్లు.

* * *

## చందాదారులను చేర్పించాలి!

జనవరిలో ఈ క్రింది విధంగా జేర్పించాలని క్రొత్తగా మరో లిస్టు ఇచ్చినాం. ఈ "కోటా"ను పూర్తి అయేటట్లు పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజాసామాన్యము పని చేస్తారని ఆశిస్తున్నాం.

ముఖ్యంగా పార్టీసభ్యులు తీవ్రంగా పనిచేసి 'కోటా' పూర్తిచేస్తారని నమ్ముతున్నాం.

| | ఫిబ్రవరి నెల కోటా | జనవరిలో చేర్పించినది. |
|---|---|---|
| విశాఖపట్టణం | 5 | 5 |
| తూ. గోదావరి | 30 | 11 |
| ప. గోదావరి | 50 | 16 |
| కృష్ణా జిల్లా | 50 | 66 |
| గుంటూరు | 30 | 31 |
| నెల్లూరు | 20 | 11 |
| రాయలసీమ | 10 | 8 |
| ఇతర స్థలాలు | 5 | 4 |
| | 200 | 152 |

## విదేశాలలో మా ఏజెంట్లు

జి. కాళిదాసు. 209 ఫేయర్ స్ట్రీట్
రంగూన్.

వర్కర్సు బుక్ షాప్. 14 కింగ్సు స్ట్రీట్.
లండన్. W. C. 2.

హానా స్టీఫెన్ సాంటిసావ్. 112 ఈస్టు 19 వ స్ట్రీట్.
న్యూయార్కు సిటీ.

